శ్రీ

# సీతారామతారావళి



గ్రంధకర్త :

రసప్రియ

శ్రీరంగాపురం పోతేదార్ కేశవాచార్యులు, B. A.,



ప్రచురణకర్త :

ఎఫ్. రవిబాబు

భోజ ప్రచురణలు

# స మ ర్ప ణ

భక్తిరస ప్రధానముగా నే నీ చిరుపొత్తమును నా వేడ్కకొలది రచించి ఉడుత భక్తితో శ్రీ సీతారామచంద్రప్రభుదివ్య చరణార విందములకు సమర్పించుకొనుచున్నాను.

“విశ్వశ్రేయః కావ్యం” అను సూక్తి ననుసరించి యీ కృతి లోకైకక్షేమమున కుపకరించుగాక। లోకమునుండి వేరుకాని నాకును, మీకును, సర్వజనులకును జగజ్జననీజనకులైన శ్రీ సీతారామ చంద్రమూర్తులు మంగళములు ప్రసాదింతురు గాక। ఈ కృతి సహృదయుల నలరించినచో కృతార్థుడనైనట్లు భావింతును.

“సర్వేజనా స్సుఖినోభవంతు”

—రచయిత.



# కృతజ్ఞతలు

శ్రీ ఆంధ్రప్రదేశ్ ఆస్థాన కవివర్యులు డా॥ దాశరథిగారిందలి పద్యములను చూచిఆనందించి నా వెన్నుతట్టి నన్నెంతయు ప్రోత్సహించి, తమ అమూల్యాభిప్రాయ మిచ్చిరి. నా కవితా కుమారి సుప్రసిద్ధ మహాకవియు, ప్రజా కవియునైన శ్రీమాన్ దాశరథిగారి పీఠిక నలంకరించడం నా భాగ్యంగా భావిస్తున్నాను. వారికి వారి సహృదయతకు నా కృతజ్ఞతాపూర్వక నమస్కృతులు.

పెద్దలు సాహితీ సామ్రాట్టులు డా॥ దివాకర్ల వెంకటావధానుల వారిదివరకే నా భక్తి కావ్యముల రెండింటికి తమ అమూల్యాభిప్రాయముల నొసంగి నన్నెంతయు ప్రోత్సహించిరి. అభిప్రాయ రూపంలో వారు కురిపించిన చలువ నా చిరుకవితల కెంతో విలువ. వారికి నా వినయాంజలి ఘటిస్తున్నాను.

విశ్వహిందూ పరిషదధ్యక్షులు, విద్వత్కవిమిత్రులు శ్రీ యర్రం విశ్వనాథంగుప్తాగారి మైత్రీ వాత్సల్యం మరువరానిది. శ్రీ గుప్తాగారు తమ అమూల్యాభిప్రాయమిచ్చుటే కాక ప్రూఫులు దిద్ది పుస్తకమును తమ వై. వి. ప్రెస్‌లో ముద్రించి యిచ్చినారు. కవిశ్రేష్ఠులైన శ్రీ శ్రేష్ఠిగారికి నా హృదయ పూర్వక కృతజ్ఞతలు.

గ్రంథ ప్రచురణానికై ద్రవ్యసహాయం చేసిన స్టేటు బ్యాంక్ ఆఫ్ హైద్రాబాదు, ఖమ్మం బ్రాంచి వారికి మిక్కిలి కృతజ్ఞుడను.

ఇందలి క్షేత్ర చారిత్రిక వ్యాస రచనలకు సమాచారముతో తోడ్పడిన మిత్రులు విద్వన్మణులు శ్రీ కన్నెకంటి సత్యనారాయణగారికి మరియు శ్రీ కొదమసింహం సత్యనారాయణచార్యులవారికి నా ధన్యవాదములు.

నా కవితా రచనలను శ్రద్ధాభక్తులతో శుద్ధప్రతులు వ్రాసిపెట్టి అల్ప వ్యవధిగల నా కెంతయు తోడుపడుచున్న నా చిరంజీవులకు, నా కవితలకు ప్రథమ శ్రోతయై నా రచనా వ్యాసంగంలో నా కెంతయు నుత్సాహము చేకూర్చి చేయూతనిచ్చు నా అర్ధాంగికి మరియు ముఖచిత్రమును ఇందలి ఇతర చిత్రములను వేసిన మా రెండవ చిరంజీవి రాజశేఖరునకు నా శుభాభినందనలు.

—రచయిత



# 'రసప్రియ' రససిద్ధి

ఆంధ్రప్రదేశ్ ఆస్థానకవి
'కళాప్రపూర్ణ'
డా॥ దాశరథి

ఖమ్మం జిల్లాపరిషత్తువారు ప్రకటించిన గణాంక వివరముల పొత్తమును శ్రీ కేశవాచార్యులుగారు గ్రథనము చేసియుండిరి. అది 1976 సంవత్సరపు పొత్తము. మా జిల్లాకు సంబంధించిన సమస్త సమాచారము ఆ చిరుపొత్తములో కేశవాచార్యులుగారు చేర్చినారు.

అందులో "భద్రగిరి సీతారామచంద్రప్రభూ" అనే మకుటముతో కొన్ని మత్తేభములున్నవి. అవి చదివి వాటిలోని భావనాపటిమకు, ధారాశుద్ధికి, రససిద్ధికి అచ్చెరువంది – తద్రచయిత పేరు తెలియజేయవలసిందిగా 'రసప్రియ' శ్రీ కేశవాచారిగారికి వ్రాసితిని. కవి తామే అని తెలియజేయుచు, రామగిరి సీతారామచంద్రునిపై వారు చెప్పిన పద్యములు, భద్రగిరి సీతారామచంద్రునిపై చెప్పిన పద్యములు నాకు పంపిరి. సంస్కృతమున మత్తేభవృత్తము కలదుగాని, అది ఈ రూపమునలేదు. దాని ఛందస్సు వేరు. తెలుగు కవులు శార్దూలములోని మొదటి గురువును రెండు లఘువులుగా కూర్చి మత్తేభము చేసిరి. మత్తేభ వృత్తము నడకలో మత్తేభయానల నడకలోవలె ఏదో సొగసున్నది.

హృద్యపద్య రచనాధురీణులైన శ్రీరంగాపురం ఫోతేదార్ కేశవాచార్యులుగారు ఆంధ్రప్రదేశ ప్రభుత్వ ప్రణాళికా గణాంక శాఖాధికారులై సాహిత్యేతర కార్య కలాపములలో నిమగ్నులయ్యును చక్కని "సీతారామచంద్ర తారావళి"ని రచించిరి. ఛందస్సు ప్రాచీనమయ్యును, భావములు ఆధునికములు. ఆధునిక భావములను ప్రాచీన ఛందమున చెప్పుటకు వీలగునని నా దృఢవిశ్వాసము.

"కవనంబందు నుతించినంతనె ప్రభూ! ఖమ్మమ్ము రప్పించుకొం
టివి; భద్రాచలసీమ చేర్చితివి......................"

అన్నారొకచోట కవిగారు. భద్రాచలము ఖమ్మము మండలమున నుండుట ఆ మండలమువారి అదృష్టము.

"నవతా మానవతా నినాద జనితానందాను రాగామృతో
ద్భవ భావైక కళాప్రపంచ కవితా పద్మాల పూజింతురా"

అంటారొకచోట. రామభక్తి నవతను, మానవతను వలదనదుకదా!

"వనలక్ష్మి దరహాస చంద్రికలతో పాల్వంచ విద్యుల్లతాం
గన........................"

ఖమ్మం జిల్లాకు చెందిన పాలవంచలోగల విద్యుదుత్పాదన కేంద్రాన్ని "విద్యుల్లతాంగన" అన్నారు కవిగారు. విద్యుల్లత అంగనయే కదా! విద్యుల్లత అంగనవలె ప్రమోదకరము, అప్పుడప్పుడు ప్రమాదకరము!

శ్రీ కేశవాచార్య కవిగారు నల్లగొండలో ఉద్యోగరీత్యా నివసించి యున్నప్పుడు "రామగిరి సీతారామ తారావళి" రచించిరి.

ఇదిగాక, "కనకదుర్గాష్టకము"ను ఈ సంపుటమున చేర్చినారు. 'రామగిరి ప్రభ'లో క్షేత్రాది విశేషములను చెప్పిరి. భద్రగిరి క్షేత్రమును గురించి వ్రాసిరి.

"ఇల దుశ్శీలము దుష్పనాతివలె నెంతేన్ నీతి పాటించు వా
రల వంచించు, దురాక్రమించు కడగండ్లందెచ్చు:.........
...........................దాని నరికట్టంజూడలేకున్న భూ
తలమందెక్కడి శాంతి?.................................."

అని ప్రశ్నిస్తున్నారు కవిగారు. దుశ్శీలాన్ని అరికట్టవలెను. ఆ ఉద్య
మమున మనమందరము దూకవలెను.

మత్తేభము వెయ్యేండ్ల పాతది. కాని కొత్తగా కనిపిస్తున్నది కేశవా
చారిగారి పుస్తకములో. సూర్యుడు ఈ ప్రపంచమంత పాతవాడు. రోజూ
ఉదయిస్తాడు. మన జీవితాలలోనికి వెలుతురు తెస్తాడు. కనక ఎప్పుడూ కొత్తగా
ఉంటాడు. రవికి కవికి పాతపడటం అంటూలేదు.

నవ్యత్వాన్ని, మానవత్వాన్ని తమ కవితలో చూపిన "రసప్రియ"గారికి
అభినందనలు. నవ వత్సర శుభాకాంక్షలు!

హైద్రాబాద్
1-1-1979

—దాశరథి



డా॥ దివాకర్ల వెంకటావధాని
ఎం.ఎ., పి. హెచ్.డి.
రిటైర్డు ఆంధ్ర శాఖాధ్యక్షులు,
ఉస్మానియా విశ్వవిద్యాలయం.
(ఆంధ్రప్రదేశ్)

మిత్రులు శ్రీ కేశవాచార్యులవారు రచించిన "దుర్గాష్టకము"ను, "శ్రీ సీతారామ తారావళి"ని ఆద్యంతము విని యానందించితిని. ఈ రెండింటియందు ప్రతి పద్యమున భక్తిభావము తొణికిసలాడుచున్నది. పద్యములు ధారాశుద్ధి శోభితములును, నిర్దుష్టములునై భక్తులెల్లరు నిత్య పారాయణము చేయుటకు దగినట్లున్నవి. "శ్రీ సీతారామ తారావళి"లో వారందందు వ్యక్తముచేసిన భావములుదాత్త గంభీరములై శ్రీ భద్రాద్రి రామదాసు శతకమునందలి పద్యములను దలపించుచున్నవి. శ్రీ ఆచార్యుల వారింకను ఉత్తమ కావ్యములు రచించి, ఆంధ్రికభినవాలంకృతులు చేకూర్తురని యాశించుచున్నాను.

—దివాకర్ల వెంకటావధాని,
హైద్రాబాదు.

కవిభూషణ యర్రం విశ్వనాథంగుప్త
ఖమ్మంజిల్లా విశ్వహిందూపరిషదధ్యక్షులు &
'తెలుగు తేజము' సంపాదకులు, ఖమ్మం.

రసప్రియ సార్థక బిరుదాంకితులైన శ్రీ కేశవాచార్యులుగారు సరస కవితావిశారదులు. పద్య గేయ వచన కవితలు చక్కగా వ్రాయగల కవులు. వీరి పొదుపు గేయం జాతీయ పొదుపు ఉద్యమ గేయ పోటీలో ప్రథమ బహుమతి నందుకొన్నది. వీరికి భక్తికృతులు రచించడంలో ఎంత ప్రీతి కలదో ప్రగతి మూలక రచనలు చేయడంలోకూడ అంత మక్కువ కలదు. వీరిది సాంప్రదాయ కవిత్వము అయినా భావములు అధునికములు; విశ్వజనీనములు. వీరికవిత్వము ధారాళమై రసపుష్టి భావసౌష్ఠవము కలిగి సరళ శైలిలో సాగుచుండును. అలతి అలతి పదములలో అనల్పభావముల నిమిడ్చగల నేర్పరులు. అర్థగణాంకశాఖలో ఆఫీసరు. నిరాడంబరులు. గణాంకము వృత్తిగా కవనము ప్రవృత్తిగాగలవారు. అందుకేనేమో వీరి కవిత్వంలో వ్యర్థపదం కనబడదు. పదాలు తూచినట్లుండును.

ఈ తారావళి యందలి పద్యములు శ్రీ కవిగారి భక్తిభావమును కవితా కౌశలమును చాటుచున్నవి మచ్చునకొక పద్యమునుదహరింతును.

"ఏమేమీ! హరువిల్లువంచి మిథిలాధీశాత్మజన్ పత్నిగా
ధీమన్ జేకొనినావ! అట్టియిన ఏదీమాతు నీశక్తి! నా
వ్యామోహంబను చాపమున్ విరచి నా ఆత్మేందిరాకన్య నా
త్యామోదాన వరించు......................."

ఇందలి వ్యామోహమను పదప్రయోగం గమనించదగినది. కవిగారు తమను తము నుద్దేశించి చెప్పుకుంటూనే సమాజమునకై ధ్వని గర్భితంగా ప్రయోగించినారు.

శ్రీ ఆచార్యులవారికెంత కవితాశక్తి కలదో అంత భగవద్భక్తి సంప్రదాయ ప్రీతి కలదని ఈ కృతియే ఋజువు చేయుచున్నది. చక్కని దైవస్తుతి పద్యములతోపాటు ఇందు రెండు క్షేత్ర ప్రచారక వ్యాసములను చేర్చినారు. పుణ్యక్షేత్రములు మన హైందవ సంస్కృతికి పూర్వవైభవమునకు నిలయములు. క్షేత్రాత్మకమైన ఈ గ్రంథము దేవాదాయ శాఖవారిచే ప్రోత్సహింపదగియున్నది. శివకేశవులయందు వీరికి అభేదభావము కలదని వీరి దైవస్తుతి కృతులవలన తెలియుచున్నది.

ప్రతిభాయుత్పత్తులుగల రసప్రియగారిట్టి మనోజ్ఞములైన కబ్బములింకను రచించి ఆంధ్రభారతిని లెస్సగా అలంకరింపజేయగలరని ఆశించుచున్నాను.

యర్రం విశ్వనాథంగుప్త

# మనవి

మా నాన్నగారైన శ్రీ కేశవాచార్యులుగారు ఉద్యోగరీత్యా వివిధ జిల్లాలలో పని చేస్తూండగా ఆ యా ప్రాంతపు విశేషాలను క్షేత్రాలను గురించి తమకున్న విరామవేళల్లో ఎన్నో కవితా రచనలు వ్రాసుకున్నారు. నల్లగొండ, ఖమ్మం జిల్లాలలో నున్నప్పుడు ఆధ్యాత్మిక చింతనతో వ్రాసుకున్న రచనలను ఈ పొత్తముగా గూర్చటమైనది.

ఇందులో ఈ శీర్షిక లున్నవి.

1. కనకదుర్గాష్టకము
2. రామగిరి సీతారామ తారావళి
3. భద్రగిరి సీతారామ తారావళి
4. కవితాంజలి
5. రామగిరి ప్రభ (వచనము)
6. భద్రగిరి క్షేత్రము (వచనము)

ఇట్టి రచనలింకా కొన్ని అచ్చుకాక ఉండిపోయినవి. మా నాన్నగారి రచనలన్నియు ముద్రించి సహృదయులకు, సాహితీ ప్రియులకు, భక్తిపరులకు అందజేయాలను కుతూహలంతో ప్రస్తుతం "సీతారామ తారావళి" అను ఈ దైవస్తుతి కావ్యాన్ని ఎస్. బి. హెచ్., ఖమ్మంవారి ఋణ సహాయంతో ముద్రించి తమ కరకమలాల కందించుచున్నాము. పాఠకులు సహృదయతతో తగు ప్రోత్సాహమొసంగి, ఇట్టి మరొక రచనా ముద్రణకు దోహదము కల్పింతురు గాక!

"సీతారామచంద్రప్రభూ!" అను మధురాక్షర మకుటప్రభావమేమోకాని నాన్నగారు తమ ఆత్మానందముకొరకు ఈ మకుటముతో పద్యములింకనూ వ్రాస్తునేఉన్నారు. అవి శతక రూపమున వెలువడగలవు.

ఇట్లు,

ఎఫ్. రవిబాబు.

సోదరులు



ఓం

శ్రీ మత్పర దేవతాయైనమః

# రామగిరి కనకదుర్గాష్టకం

శ్రీ కారుణ్యపయోధివై త్రిభువనశ్రీరాజ్యధౌరేయవై
లోకైకావనవై జగజ్జననివై లోకోపకారంబు సు
శ్రీకాంతుల్ వెదజల్లుచున్ వెలయు నీ శ్రీపాదరాజీవముల్
దాకన్ మూర్ధము వాల్చితిన్ కనకదుర్గామాత! కాపాడవే!

ఓ కామేశ్వరి! ఓ శ్రితావనకరీ! ఓ సర్వలోకేశ్వరీ!
ఓ కారుణ్యవిలాసహాసలహరీ! ఓ దోషనాశంకరీ!
శ్రీకాంతుల్ విరజిమ్మ నీ చరణముల్ సేవింతు సద్భక్తి లో
కైకక్షేమశుభంకరీ! కనకదుర్గామాత! కాపాడవే!

ఓ కాత్యాయని! ఓ త్రిలోకజననీ! ఓ సర్వలోకావనీ!
ఓ కారుణ్యరసామృతోజ్జ్వలధునీ! ఓ దైత్య సంహారిణీ!
నీ కారుణ్య మొకింత నాపయిని రానీ తల్లి! కైమోడ్తు ర
క్షాకార్యక్రమకారిణీ! కనకదుర్గామాత! కాపాడవే!

జై శార్దూలతురంగగామిని! జగత్ సౌభాగ్య సంధాయినీ!
జై శర్వాణి! కృపాతరంగిణి! హరస్వాంతాబ్జభృంగీమణీ!
జై శూలాయుధఖండితాసురవనీ! జై పావనీ! నీ దయా
రాశిన్ మమ్ముల దేల్చుచున్ కనకదుర్గామాత! కాపాడవే!

శ్రీ మన్మంగళ దాయకంబయి జగత్ క్షేమైక నిక్షేపమై
క్షామ క్షోభ దవాగ్నులార్పుచు సుభిక్షశ్రీప్రదంబై శ్రిత
క్షేమానుగ్రహధామమై వెలయు నీ శ్రీ పాదముల్ నమ్మితిన్
రామాద్రీశ్వరి! ఈశ్వరీ! కనకదుర్గామాత! కాపాడవే!

శ్రీమతంబులు నీలసత్ చరణముల్ సేవింతు లోకైక మా
తా! మాతంగి! సువర్ణవృష్టి గురియన్ దారిద్ర్యదావాగ్ని స
త్ర్వమన్ మాన్పి సుభిక్షమేర్పరుపవే! దేవీ! దయాంభోనిధీ!
రామాద్రీశ్వరి! ఈశ్వరీ! కనకదుర్గామాత! కాపాడవే!

అమ్మా! నీ చరణమ్ములే శరణమమ్మా! నాకు నీకన్న దై
వమ్మెవ్వారు జగాన? నీ కరుణ నాపై జిల్కి నన్నేల రా
వమ్మా! పెన్నిధిగన్న పేదయటు నీయంఘ్రుల్ మదిన్ నమ్మి జై
త్రమ్మున్ జేసెదనమ్మ! శ్రీకనకదుర్గామాత! కాపాడవే!

మాతా! పూర్ణదయాహృదంచిత! జగన్మాతా! త్రిలోకైక సం
పూతా! ఆశ్రిత పారిజాత! విలసత్పుణ్యార్థ సంధాన వి
ఖ్యాతా! మంగళ దేవతా! శరణమంచశ్రాంతమున్ భక్తిమై
కైతన్ నిన్గొనియాడెదన్ కనకదుర్గామాత! కాపాడవే!

మంగళం మంగళం మంగళం.





శ్రీ సీతారామచంద్ర పరబ్రహ్మణేనమః

# రామగిరి సీతారామతారావళి

శ్రీమన్మంగళనామ! దివ్యచరిత శ్రీరామ! లోకైక సం
క్షేమానుగ్రహధామ! నిర్మలయశశ్శ్రీకామ! దుర్వార సం
గ్రామోర్వీతల వైరిభీమ! ఘనమేఘశ్యామ! జేజే పరం
ధామా! శ్రీరఘురామ! రామగిరి సీతారామచంద్రప్రభూ!

రాతిన్ నాతిగజేసె వానరవరున్ బ్రహ్మజ్ఞుగాజేసె బల్
ఘాతక్రూర భయంకరాసురఖలున్ గంధర్వుగాజేసె దు
ర్భీతున్ భ్రష్టును రాజుజేసె భవదంఘ్రి స్పర్శభాగ్యంబహో!
ధాత్రీజాహృదయేశ! రామగిరి సీతారామచంద్రప్రభూ!

మాపై నీదయగల్గుదాక రఘురామా! భక్తమందారమా!
నీ పాదంబులు వీడకుండెదము తండ్రీ! మమ్ము రక్షింపవే!
ప్రాపెల్లప్పుడు మాకు నీవెయని సంభావించి సద్భక్తి నీ
దాపుంజేరితిమయ్యా! రామగిరి సీతారామచంద్రప్రభూ!

ఏదీ నాకొకసారిజూపు! మునుపీవేరాతినో నాతిగా
పాదస్పర్శకు మార్చినావట! మనఃపాషాణమున్ దాక నీ
పాదాబ్జంబది కందిపోవునొకొ నాపై మోపవీ వట్లు కా
దా! దోషౌఘవిరామ! రామగిరి సీతారామచంద్రప్రభూ!

ఏమేమీ! హరువిల్లువంచి మిథిలాధీశాత్మజన్ పత్నిగా
ధీమన్ జేకొనినావ! అట్లయిన ఏదీ చూతు నీశక్తి నా
వ్యామోహంబను చాపమున్ విరచి మత్స్వాంతేందిరాకన్య న
త్యామోదాన వరించు రామగిరి సీతారామచంద్రప్రభూ!

జలధిన్ దాటె ధరాసుతన్ గనుగొనెన్ శౌర్యక్రియన్ శత్రుసే
నల విధ్వంసమొనర్చె, లక్ష్మణుని ప్రాణాల్గాచె, మైరావణా
దుల పోకార్చె నెవండువాని హనుమంతున్నీదు భక్తున్ మదిన్
దలతున్ దుర్గతిబాయ రామగిరి సీతారామచంద్రప్రభూ.

నీ కష్టంబుల జూడలేక శివుడే నీకున్ సహాయంబు న
స్తోకాసక్తి నెసంగగూర్చె హనుమంతుండై అదట్లౌటచే
ఈ కాలానికి అంజనేయగుడి లేకేగ్రామమున్ లేదు సీ
తాకాంతా! శివవంద్య! రామగిరి సీతారామచంద్రప్రభూ!

అరయన్నీదగు నామ సంస్మరణచే నంభోధిలంఘించె వా
నరుఁడానాడవలీల నేడిపుడు నీ నామంబు ధ్యానించుచో
నరుఁడన్నేను భవాబ్ధి దాటుటొక వింతా! నీదు మాహాత్మ్యమున్
దర మేవర్ణనసేయ రామగిరి సీతారామచంద్రప్రభూ!

తొలగున్ కష్టభరంబు, క్షీణమగున్ దోషౌఘపంకంబు, వై
దొలగున్ శత్రుభయంబు, నాశనమగున్ దుర్వ్యాధిభూతంబు సీ
తలపేమాత్రముగలు భక్తులకు. నిన్ ధ్యానింతునో భక్తవ
త్సల! నన్నేలగదయ్య రామగిరి సీతారామచంద్రప్రభూ!

కామక్రోధమదాగ్రహాది రిపువర్గ ధ్వంసమున్ జేయు, ను
ద్దామ శ్రేయముగూర్చు, సజ్జన పరిత్రాణంబుగావించు, నీ
నామధ్యాన మహత్వమున్ బొగడగా నాకౌనె రామా! పరం
ధామా! శ్రీరఘురామ! రామగిరి సీతారామచంద్రప్రభూ!

నాకంబందు సురాళికేసుధగొనన్ రాదయ్యేటిన్ గాని ఈ
లోకంబందున దైత్యమించునరుడున్ గ్రోలంగయోగ్యండె అ
స్తోకాసక్తి భవత్కథామృతము, నెంతున్నీమహత్వంబు సీ
తాకాంతా! దయజూడు! రామగిరి సీతారామచంద్రప్రభూ!

ఈవే తల్లివి దండ్రియున్ గురుడవీవే! ఈవె దైవంబ వో
దేవా! ఆశ్రిత పారిజాత! కరుణాబ్ధీ! సర్వలోకావనా!
నీవున్ దప్పనితః పరంబెరుగ తండ్రీ! వేగనన్నేల రా
దా! వాత్సల్యనిధాన! రామగిరి సీతారామచంద్రప్రభూ!

అరయన్ శత్రువు తమ్ముడైన శరణంబన్నంత మాత్రాన సో
దర భావంబునఁ జేరఁదీసితివికాదావాని, నేనున్ భవత్
శరణార్థిన్ రవివంశ! నన్నెరుగవే! జాగేల! నీవాడ నన్
దరి జేర్పన్ దడవేల? రామగిరి సీతారామచంద్రప్రభూ!

రవి భాస్వత్కిరణంబులున్ జలధిలో రత్నంబులున్ లెక్కిడన్
లవ మాత్రంబును పీలుకాని పగిదిన్ రాజిల్లు నీ సద్గుణా
లవురా లెక్కిడ సాధ్యమే? ఉడతయట్లాసక్తి సేవింప నీ
స్తవమున్ జేసెదగాక! రామగిరి సీతారామచంద్రప్రభూ!

పుడమిన్ నీయెడ స్వామిభక్తి ప్రకటమ్మున్ జేయు నీ గాధలన్
దడవన్ ఢీకొనె పక్షి రాక్షసుని యుద్దండ క్రియన్, చిట్టిదై
కడలిన్ గట్టగవచ్చెపో ఉడుత, సంగ్రామంబులో వైరికిన్
దడ బుట్టించెను కోతి, రామగిరి సీతారామచంద్రప్రభూ!

తనకున్ మాలిన ధర్మమేటికని నిందల్ రాజకీయంబులో
అనయంబేయని నేడుకొందఱువురా! స్వార్థానికర్థంబెరుం
గని నీవంటి అమాయకప్రభువు కానన్ కొంతనా రాజ్యకాం
తన పంపించునటంద్రు రామగిరి సీతారామచంద్రప్రభూ!

అనురాగాబ్ధి తరంగడోలికల నాట్యంబాడు మీ నిత్య నూ
తన దాంపత్యమదే యుగాలకును నాదర్శంబె కానీ ధరా
తనయన్ కానలకంపు నీ ప్రభుతనిర్దాక్షిణ్యమేమందురా!
తన మేలెంచనిరేడ! రామగిరి సీతారామచంద్రప్రభూ!

ఒక సామాన్యునిమాడ్కి భూమిపయి నెన్నోకష్టముల్ సైచి ధ
ర్మిక మార్గంబును వీడకుండ జనతా శ్రేయోర్థమై రాజ్యకాం
తకు సర్వస్వము ధారవోసితివి కాదా! ధర్మకర్తవ్య సా
ధక నీకెవ్వరుసాటి? రామగిరి సీతారామచంద్రప్రభూ!

ధరణిన్ నేటికి రామరాజ్యమని ఆదర్శంబుగా జెప్పుకొం
దురు నీవేలిన పుణ్యభూమి ఇపుడెందున్ జూడ దుర్వార దు
ర్భరదారిద్ర్యదవాగ్నికీలలఁ దపింపంజొచ్చె వేవేగ ని
ద్ధరఁగాపాడగరమ్ము। రామగిరి సీతారామచంద్రప్రభూ।

నరరూపాసురులార్థికాభ్యుదయ యజ్ఞధ్వంసకుల్ నేడు కొం
దరు కల్పింతురు లేని కాటకములన్ దాపుల్లబో పుల్లతో
ధరణిన్నేడిఁక రామరాజ్యమును సంస్థాపించి కాపాడుమో
ధరణీజాహృదయేశ। రామగిరి సీతారామచంద్రప్రభూ।

గతమందెప్పుడొ మౌని యాగమును రక్షంజేసినావంట, దు
రతులన్ బాపెడు సాంఘికాభ్యుదయ యాగంబిప్డుగాపాడి భా
రత ఖండంబున రామరాజ్యమెసలారన్ జేయుచో నెంతు ను
ద్ధతమౌ తాపకశక్తి రామగిరి సీతారామచంద్రప్రభూ।

నీవేనాడొ దురంతముల్ సలుపు దుర్నీతున్ దురాత్మున్ దశ
గ్రీవున్ రావణుఁజంపినాడవట। లేరే నేటి కాలంబులో
గ్రీవంబొక్కటిగల్గు రావణులు వారిన్ గూడ శిక్షింపరా
దా। వైరివ్రజభీమ। రామగిరి సీతారామచంద్రప్రభూ।

భూమిన్నేడుదయింపు వేగమె ప్రభూ। మూర్ఖప్రపంచైక సం
గ్రామాణ్వస్త్రభయంకరాసురవధన్ గావించి లోకైక సం
క్షేమంబేర్పడజేయగా నిరతమున్ సేవింతు నిన్నే పరం
ధామా। శాత్రవభీమ। రామగిరి సీతారామచంద్రప్రభూ।

ఏ త్రేత్రాయుగమందొ రాక్షసుల నెంతేన్ చండినావంట యి
ద్ధాత్రిన్ లేరాకొ నేడు రాక్షసులు, కోదండంబు చేబూని ఆ
పాత్రన్ దాలిచి రావదేల జగతిన్ పాలించ లోక ప్రభూ!
ధాత్రీజా హృదయేశ! రామగిరి సీతారామచంద్రప్రభూ!

ఘనకాఠిన్య కుచప్రదేశమున వేడ్కన్‌గుల్కు చేలాంచలం
బన నాగార్జునసాగరంబది గిరి ప్రాంతంబులన్ దూకుచున్
కనువిందై చను నల్లగొండను ధరాకాంతా విశాలోన్నత
స్తన దుర్గద్వయసీమ రామగిరి సీతారామచంద్రప్రభూ!

యుగముల్‌దాటినవీడునే విమలబంధోపేత సంబంధముల్
నగముల్ రెండు కుచద్వయంబనగ నీనల్గొండలో నింపుసొం
పుగ వర్ధిల్లిన భూసతిన్ ప్రభుతపెంపున్ మీర పాలించగా
తగనిచ్చోట వసింతు రామగిరి సీతారామచంద్రప్రభూ!

సతితోఁ దమ్ములతోఁ గపిప్రవరుతో సామ్రాజ్యపట్టంబుతో
ధృతిమీరన్ కలియందు రామగిరి ధాత్రిన్ ప్రీతి విచ్చేసి నా
పతుల శ్రేయః ఁగూర్చి భూప్రజల ప్రేమాసక్తితో కన్నసం
తతినప్లేలుకొనఁగ రామగిరి సీతారామచంద్రప్రభూ!

శ్రీరామా! భవదీయదివ్యచరణశ్రీ నాపయిన్ మోపి నా
ప్రారబ్ధాఘశిలన్ శుభాకృతిగ మారన్‌జేయవే! భక్తి పెం
పారన్ గొల్చెద రాతినాతిగ నొనర్పన్‌జాలు నీ పాద మం
దార శ్రీఁదలదాల్చి, రామగిరి సీతారామచంద్రప్రభూ.

మంగళం మంగళం మంగళం



సంప్రాప్య రామ నవమీం తులసీదళాద్యైః
సంపూజ్య భద్రగిరి వాసిన మాది దేవం
కృత్వోపవాస మథ జాగరణం చ మర్త్యైః
సాక్షత్పదం రఘుపతేః పరమం ప్రయాతి.

దురాక్రమించు ధూర్తుపై పరాక్రమించు ఖేచరా !
ధరిత్రి మానుషమ్మె నీ చరిత్రతో తరించెరా !




మునుపిచ్చోట జటాయు రావణునితో
పోరాడుచున్ గూలి రా
ల్చిన క్రొన్నెత్తుటి చుక్కలీకెలవి
మిర్చి ధూమ్ర పత్రాకృతుల్
గని ద్రవ్యాయుధమూని గాటనెడి
కక్షన్ ఘోర దారిద్ర్యమన్
దనుజున్ గూల్చును గాదె! భద్రగిరి
సీతారామచంద్రప్రభూ!



శ్రీ సీతారామచంద్ర పరబ్రహ్మణేనమః

# భద్రగిరి సీతారామతారావళి

శ్రీ కళ్యాణగుణాభిరామ! భువన క్షేమైకనిక్షేపమా!
శ్రీ కాకుత్స్థకులాబ్ధిసోమ! శరణార్థిశ్రేణి కల్పద్రుమా!
శ్రీ కారుణ్యరసాలసాలఫలరాశీధామ! నీ పాదముల్
దాకన్ మూర్ధమువాల్తు భద్రగిరి సీతారామచంద్రప్రభూ!

రాజుల్ భోజుల్ బూజుపట్టిరిక సామ్రాజ్యాధికారంబులే
రోజున్ శాశ్వతమొందజాలక వినిర్మూలించె నైనన్ భవత్
సౌజన్యాంచిత రామరాజ్యమది ఆ చంద్రార్కమున్ వెల్గుకాదా! జేజే రఘురామ! భద్రగిరి సీతారామచంద్రప్రభూ!

నీ నామస్మరణామృతంబు నెవఁడేనిన్ గ్రోలు నవ్వానికిన్
నానాశత్రుఁరుజేతి బాధలిసుమంతన్ దాకఁజాలవు సదా
నీ నామస్మరణంబుఁజేసెదము తండ్రీ! మమ్ము నీ కన్న సంతానంబట్లు గ్రహించు భద్రగిరి సీతారామచంద్రప్రభూ!

అరెరే! ఎంగిలివడ్డ పండ్లకయి అంతాపేక్షయా! పండ్లకై
కరువుఁగొంటివ! ఆకలిన్ సయిపలేకన్ దింటివా! లేక భ
క్తిరసఁబెంగిలికాదా! ఆ శబరి రీతిన్ గాన్కలర్పింపఁ దు
స్తర మార్గంబదిమాకు భద్రగిరి సీతారామచంద్రప్రభూ!

జనకాజ్ఞన్ దలదాల్చినందులకు రాజ్యభ్రంశమున్ గల్గె సీ
తను దుర్మార్గుఁడు దొంగిలించె, బ్రతుకంతన్‌గాన పాలయ్యె నే
మనెదన్ మంచికిఁబోవ చెడ్డ యెదురైనట్లాయె సన్మార్గవ
ర్తన కేలా కడగండ్లు? భద్రగిరి సీతారామచంద్రప్రభూ!

ఏమయ్యా! పడరాని పాట్లుబడినావే తండ్రి మాకెంచి ఓ
రామయ్యా! ఇపుడన్నఁ దండ్రితలపై రాల్ రువ్వ వారెందరో
భూమిన్ బుట్టిరి వారికేవిధముగా బోధించనౌ నీదు గా
ధామాహాత్మ్యము నేడు భద్రగిరి సీతారామచంద్రప్రభూ!

అయయో! స్వీయ సతీవియోగమున హాహా! యంచు నీవేడ్వ నీ
దయనీయ స్థితి కద్రులేడ్చినవికాదా! నేటికిన్ జూడ సం
దియమే లేదని నిర్ఝరుల్ గిరులయందే పుట్టుగా! యెంత ని
ర్దయుఁడో దుర్విధియెంచ! భద్రగిరి సీతారామచంద్రప్రభూ!

పితృవాక్పాలనసకన్న మౌని జనతా ప్రీత్యర్థమై దైత్యులన్
హతులన్ జేయుటకన్న శత్రుతతి సంహారంబుకన్నన్ దురా
గతమున్ ధిక్కొని నిస్పృహాయ నదలన్ గాపాడు పక్షీంద్రు ప్రో
ద్ధత సౌజన్యముమిన్న భద్రగిరి సీతారామచంద్రప్రభూ!

ఇదె గోదావరి పర్ణశాల యిదె యిందే జానకిన్ దొంగిలిం
చె దురాత్ముండు దురాగతంబెదుర పక్షింజంపె నిచ్చోట నం
చెద నొవ్వన్ నది కన్నుపుల్ వరదలై ఈనాటి కష్టప్రత్య
క్షపదముల్ దాకగ జూచు భద్రగిరి సీతారామచంద్రప్రభూ!

ఇటఁ లంకేశుఁడు సీతనెత్తుకొని పోయెన్ గర్భశోకాగ్నిఁ గ్రుం
గుటఁ భూదేవికి గుండియల్ గమిలి బొగ్గుందేఁ 'కోల్మైను' లి
ప్పుటఁ వర్ధిల్లె పరోపకారమొనగూర్పన్ సజ్జనుల్ మానరెం
తటి సంతప్తులునైన - భద్రగిరి సీతారామచంద్రప్రభూ!

మునుపిచ్చోట జటాయు రావణునితో పోరాడుచున్ గూలి రా
ల్చిన క్రొన్నెత్తుటి చుక్కలీకెలవి మిర్చిధూమ్రపత్రాకృతుల్
గని ద్రవ్యాయుధమూని గాటనెడి కక్షన్ ఘోర దారిద్ర్యమున్
దనుజున్ గూల్చునుగాదె! భద్రగిరి సీతారామచంద్రప్రభూ!

ఇట సీతన్ దనుజుండు దొంగిలిడె నంచీ భూమి నిట్టూర్పునో!
కట! మేఘుండదిగాంచి యేడ్చునొ! మహాఉగ్రస్థాయినిండెం దె ని
చ్చటి ఉష్ణోగ్రత వర్షపాతము అహో! సస్యావనీలక్ష్మి ఈ
తటి వర్ధిల్లఁగజేయ భద్రగిరి సీతారామచంద్రప్రభూ!

వనలక్ష్మి దరహాసచంద్రికలతో పాల్వంచ విద్యుల్లతాం
గన శోభాభ్యుదయాంగ వీచికలతో నానా ప్రవాహాలతో
అవిజ శ్రీ తినకాభిషేకములతో కంబాద్రి యాంధ్రావనీ
ప్రైన దుర్గంబయి గ్రాలు! భద్రగిరి సీతారామచంద్రప్రభూ!

ఇదె నాగార్జునసాగరంబిటకు రానేవచ్చె 'పాలేరు' ప
య్యెద పొంగించె తరంగహస్తముల 'వైరా' ఉలింగనోత్సాహవ
భ్యుదయంబై సిరులొల్క 'లంక' మనసుప్పొంగించు దుర్భిక్ష మొ
త్తదిఁ కన్నిదయచేత భద్రగిరి సీతారామచంద్రప్రభూ!

స్థిరసౌఖ్యంబుల గూర్చు స్తంభగిరి ధాత్రీమండలంబందు కి
న్నెర, మున్నేరు, మురేదు, తాళి, శబరి, నాగార్జునా గౌతమీ
ఝరులుప్పొంగుచు శీతలోదకములన్ క్షామాగ్నిఁ జల్లార్ప వి
ద్ధరణీపాలనసేతు భద్రగిరి సీతారామచంద్రప్రభూ!

ఝరులుప్పొంగిన పుణ్యభూమి, అటవీ సౌభాగ్యలక్ష్మీకృపా
ఝరులుప్పొంగిన భాగ్యసీమ, ఖనిసస్యక్షీరజముల్ జేపఁ బల్
సిరులుప్పొంగిన జీవగడ్డ, ఇది నీ శ్రీపాద సంస్పర్శచే
త రహించున్ గదస్వామి! భద్రగిరి సీతారామచంద్రప్రభూ!

శిలభామాకృతిజేయు నీదు చరణశ్రీస్పర్శ బంగారు పం
టలు పండించుటదెంత మాతెనుగు రాష్ట్రంబందు స్తంభాద్రి మం
డల భద్రాచలసీమ నీవు దిగుగాడన్ జేసి తత్భాగ్య మి
స్థలికిన్ ప్రాప్తిలకున్నె? భద్రగిరి సీతారామచంద్రప్రభూ!

ఇల దుశ్శీలము చుప్పనాతివలె నెంతేన్ నీతి పాటించు వా
రల వంచించు, దురాక్రమించు, కడగండ్లందెచ్చు స్తంభాద్రిమం
డల భద్రాచలధామ! దానిసరికట్టంజూడ లేకున్న భూ
తలమందెక్కడి శాంతి? భద్రగిరి సీతారామచంద్రప్రభూ!

అల మారీచసుబాహులట్లిపుడు దుర్వ్యాపార దుశ్శీల ధూ
ర్తులు సంఘవ్యతిరేకులభ్యుదయరోధుల్ లేరె? స్తంభాద్రి మం
డల భద్రాచలధామ! వారినరికట్టంజాడు లేకున్న భూ
తలమందెక్కడి శాంతి? భద్రగిరి సీతారామచంద్రప్రభూ!

అల కాకాసురుడంత కాని పనిసేయన్ వాని మన్నించి నా
విల కాకాసురులెందరో కలరు తండ్రీ! నేడు స్తంభాద్రి మం
డల భద్రాచలధామ! వారినరికట్టంజాడు లేకున్న నీ
తలపైకెక్కెదరింక భద్రగిరి సీతారామచంద్రప్రభూ!

తలకాయల్ పదియుండి రావణుడొకింతన్ నిన్ను లెక్కించడే
యల లెక్కించునదెట్లు? ఒంటితల వాడీనాడు స్తంభాద్రి మం
డల భద్రాచలధామ! నీ కథల నుల్లాచెప్పుచే గొప్ప భూ
తల మందిప్పుడు చూడు భద్రగిరి సీతారామచంద్రప్రభూ!

ఆ మారీచుని జంపినాడవెపుడో ఆ వంచకున్ మించుపో
మా మారీచుడు వాని మాయలవగా మారించినన్ మళ్లి మై
మై మాటొడ్డగలేచి వచ్చు ఋణమన్ మారీచ దానీచు ను
ద్దామ క్రీడ వధించు భద్రగిరి సీతారామచంద్రప్రభూ!

ధరణిన్ నేటికి రామరాజ్యమని ఆదర్శంబుగా జెప్పుకొం
దురు, నీ వేలిన భూమిమీద సుఖశాంతుల్ నేడు పండింపగా
చిర దారిద్ర్యదవాగ్నినార్పు కృషిక స్వేదంబు వర్షింప మా
తరముల్ నేర్వగజాడు భద్రగిరి సీతారామచంద్రప్రభూ!

ఓ త్రేతాయుగ చక్రవర్తీ! ధరణీయోధాగ్రణీ! పాలనా
పాత్రౌచిత్య కళావిలాస చతుర ప్రజ్ఞానిధీ! నేడు నీ
క్షేత్రంబొప్పు దరిద్రతాసురవధన్ గావించి సంక్షేమమున్
ధాత్రీపుత్రిని బ్రోవ భద్రగిరి సీతారామచంద్రప్రభూ!

అరెరే! చెప్పులు గోరఁ దమ్మునికి నాప్యాయంబుగానిచ్చి యె
క్కారణిన్ రిక్తపదంబులన్ నడచితో కారాటవిన్ కంటకో
త్కారమెల్లార్చితో! పాదరక్షలయి నీ కాళ్లంటలేనైతి న
త్తరుణంబందున దేవ! భద్రగిరి సీతారామచంద్రప్రభూ!

చైతన్యంబును లేని పాదుకలహో! సామ్రాజ్య పట్టంబుతో
పూతోద్దీపికలయ్యె నీ పదయుగంబున్ దాకుటంజేసి, నే
చైతన్యుండ త్వదంఘ్రులంటెదఁక నేసద్యోగముల్ గూర్చెదో
ధాత్రీజా హృదయేశ! భద్రగిరి సీతారామచంద్రప్రభూ!

యెడబాటే బడబాగ్నిగాగ బ్రతుకంగేరీతి సాధ్యంబు నీ
యెదదన్ సీతయు నీవు సీతయెదలో నెవ్వేళఁ ధ్యానింపఁగా
బదుపంగాక! స్మరింతు మీయుభయులన్ భావంబులో నెప్పుడున్
దడవేలా నను బ్రోవ! భద్రగిరి సీతారామచంద్రప్రభూ!

శ్రీమన్మంగళ దాయకంబయిన నీ శ్రీపాద పద్మంబులన్
నా మూర్ధంబున దాల్చి సంతతము నీ నామామృతస్వాదచిం
తామోదాంబుధిఁ దేలియాడెదను నిత్యంబివ్వ నన్నేలు ము
ద్దామ శ్రేయముఁగూర్చి భద్రగిరి సీతారామచంద్రప్రభూ!

మంగళం మంగళం మంగళం

# కవితాంజలి



అవనిన్నివు సమస్త భూతములయందవ్యక్తమై యుంటచే
నవతా మానవతా వినాద జనితానందానురాగామృతో
ద్భవ భావైక కళాప్రపంచ కవితా పద్మాల పూజింతురా
స్తవ నీయక్రియ నిన్ను భద్రగిరి సీతారామచంద్రప్రభూ!

శివుడై కేశవుడై సరోజభవుడై చిత్తాలయస్వామియై
స్తవ నీయక్రియ లోకపాలన కళాధౌరేయుడై క్రాలు వా
డెవడా విశ్వకుటుంబి వాని నినుగానెవ్వేళ భావించి నీ
స్తవమున్జేసెద ప్రోవు భద్రగిరి సీతారామచంద్రప్రభూ!

పదముల్ సొలవు నీ పదాలొలువ భావంబంతకుంజాలదిం
పొదవన్నీమహిమమోన్నతుల్వొగడ నేవో కొన్ని పద్యాలు నా
హృది భృంగాలయి నీదు నామ మకుటశ్రీఝంకృతింజేసి త్వ
త్పద పంకేజములంటు భద్రగిరి సీతారామచంద్రప్రభూ!

తెనుగుందేనియలొల్కు పద్యముల భక్తిన్ నీకు నర్పింపగా
నను భద్రాచలమండలాంక విభునింగావించి ఉద్యోగమం
దున వృద్ధిక్రమ పీఠమిచ్చితివి చేతుల్ మోడ్చి నీ దివ్య కీ
ర్తన గావించెదనయ్య! భద్రగిరి సీతారామచంద్రప్రభూ!

కవనంబందు మతించినంతనె ప్రభూ! ఖమ్మమ్ము రప్పించుకొం
టివి, భద్రాచలసీమ జేర్చితివి తండ్రీ! నీ పద స్పర్శచే
త విరాజిల్లు పరాగమిచ్చుట రవంతన్ సోకునా నా పయిన్
స్తవమున్ జేసెద నిన్ను భద్రగిరి సీతారామచంద్రప్రభూ!

నీపై కబ్బములల్లి బూనుటకు తండ్రీ! సాధ్యమే యేరికిన్
నాపై నీదు కృపారసమ్మొలకుటన్ నా గుండెలో నేవో యే
వో పద్యాల సుమాలు పూచినవి నీ పూజార్థమై నన్ను నీ
దాపున్ జేరగనిమ్ము భద్రగిరి సీతారామచంద్రప్రభూ!

అంతోయింతో కవిత్వమల్లుటకు చేతైనంత మాత్రాన రా
ద్ధాంతంబౌనటు రామగాథగొని కైతన్ దిక్కులంబ్రాక నీ
కింతా ఆశయటంచు నెంచకుము పేదే పెన్నిధిన్ గోరు న
త్యంతంబున్ దయజూడు భద్రగిరి సీతారామచంద్రప్రభూ!

తేనెల్ జిందు తెనుంగుకబ్బమున తృప్తిందీర పద్యంబులన్
వీనుల్ విందు గొనంగ గైకొనగదే వేయేల మా తెన్గు వీ
ణా నాదభ్రమరమ్ము ఝుమ్మన జగన్నాథత్వమేలా? పరి
త్రాణప్రీతి విధాన! భద్రగిరి సీతారామచంద్రప్రభూ!

భవదీయాంఘ్రి పరాగరాగ మది నాపైనింతయేన్ సోకనీ
యవు నా తండ్రి! సమస్తభూతనిలయా! అస్పృశ్యతాప్రేత మీ
భువిపై మానవతాసిధారలకు నిర్మూలించెనేనాడో నన్
దవులం జోషమటయ్యా? భద్రగిరి సీతారామచంద్రప్రభూ!

కై మోడ్పుల్ ఘటియించి నీ చరణయుగ్మశ్రీలపై వ్రాలితిన్
కామక్రోధమదాగ్రహాది రిపువర్గ ధ్వంసమున్ జేసి న
న్నే మార్గంబున నేలుకొందువొకో నీవేదిక్కు తండ్రీ! పరం
ధామా! శ్రీ రఘురామ! భద్రగిరి సీతారామచంద్రప్రభూ!

నీ లీలాకరుణావిలాసముల వర్ణింపంగ నా బోటి కే
లీలన్ సాధ్యము భారమంతయును నీదేయంచు కైమోడ్తు మా
ర్జాల* న్యాయముతోడ నన్ను కృపతో రక్షింపరావేల సీ
తాలక్ష్మీహృదయేశ! భద్రగిరి సీతారామచంద్రప్రభూ!

క్షితి నీగాధ పఠించినన్ వినిన భక్తిన్ వ్రాసినన్ నీ దయా
మృత వృష్టిన్ గురియించుచుందువని స్వామీ! నీదు స్తోత్రావళిన్
కృతిగా గూర్చితి దీని గైకొని జగత్క్షేమంబు జేగూర్చి సం
తతమున్ నన్దయజూడు భద్రగిరి సీతారామచంద్రప్రభూ!

నామంబెన్నగ కేశవుండ నవనిన్ రామాంబికా జానకీ
రామాచార్యుల కగ్రనందనుడ శ్రీరంగాపురీధాముడన్
కైమోడ్తున్ భవదీయపాదములకున్ గాపాడరావే! పరం
ధామా! శ్రీ రఘురామ! భద్రగిరి సీతారామచంద్రప్రభూ!

మంగళం మహత్ శ్రీ శ్రీ శ్రీ

---

* మార్జాల కిశోరన్యాయము



శ్రీరాఘవం దశరథాత్మజ మప్రమేయం
సీతాపతిం రఘుకులాన్వయ రత్నదీపం
ఆజానుబాహు మరవింద దళాయతాక్షం
రామం నిశాచర వినాశకరం నమామి

# రామగిరి ప్రభ

"రామగిరి" నల్లగొండ నగరానికి ఉపనగరము. ఇచటి వీథులు సువిశాలములు. వాతావరణము ప్రశాంతమైనది.

రామగిరి అనగా చిత్రకూటపర్వతమని విఖ్యాతమువు. అచట నివసించినంతకాలము సీతారామలక్ష్మణులు ఆనందముగా గడిపిరి.

రామగిరిలో రెండు పవిత్రదేవాలయములు వెలసియున్నవి. ఒకటి శ్రీ కనకదుర్గాలయము రెండవది శ్రీ సీతారామచంద్ర స్వామివారి ఆలయము.

శ్రీ కనకదుర్గాలయము రామాలయము వెనుకవీధిలో ఒక చిన్నగుడి. గుడిలో వెలసిన అమ్మవారి విగ్రహము సలక్షణ శిల్ప కళా శోభితమై దివ్యతేజోవంతమై త్రిజగన్మాతృత్వమును ప్రస్ఫుటింపజేయుచు మధురప్రసన్న మంగళవదనారవిందముతో అపార కృపారసామృత కటాక్షవీక్షణాలు వెదజల్లుచు వెలసియున్నది. దర్శనమాత్రాన భక్తాది దీనజనులకు "శరణు! శరణు! మాతా!

జగన్మాతా! దుర్గాభవానీ! కాపాడవే" అని సాష్టాంగపడి కై మోడ్పు లర్పింపవలెనను భక్తిరసావేశము కలుగుచుండును అమ్మవారు శార్దూలవాహినియై శూలాయుధపాణియై మహిషాసుర మర్దినియై అష్టభుజయై శంఖచక్రాది సర్వశుభాలంకరణ శోభితయై విరాజిల్లు చున్నది. ప్రతిదినము అర్చన సంసేవాదులు దశరా నవరాత్ర్యాది ఉత్సవాలు యజ్ఞయాగాదులు భక్తజనులు యథాశక్తిని జరుపు కొనుచు అమ్మవారిని సేవించుకొనుచు అమ్మవారి దయకు పాత్రు లగుచున్నారు. అమ్మవారు వెలసిన ప్రభావముచే రామగిరిలో కలరా మశూచికాది ఉపద్రవాలు సోకవని ఈతిబాధలు వేధించవని జనశ్రుతి కలదు. విగ్రహము మహిమాన్విత యంత్రప్రతిష్ఠిత మందురు. గుడి ప్రాంగణములో ప్రక్కవైపున నాగ శిలావిగ్రహము ముందుభాగమున అపూర్వముగా శిల్పించిన ఒక పద్మచిత్రముగల విశాల శిలాఖండిక పురాతన మతసంస్కృతిని శిల్పకళా నైపుణ్యా మును చాటుచున్నవి. గర్భగుడి మాత్రమే వెలసియున్నది. ఉన్నంత చుట్టుప్రాంగణములో మంటప ప్రాకారావరణాది సౌక ర్యముల సమకూర్చి ఈ ఆలయ పునరుద్ధరణముగావించి అభివృద్ధి పరచవలసిన అవసరమెంతైన కలదు.

ఇక శ్రీ సీతారామచంద్రస్వామివారి ఆలయము ఇచటి ప్రధాన దేవాలయము. పట్టాభిషేక వైభవముతో సీతారామ లక్ష్మణ భరత శత్రుఘ్న ఆంజనేయాదుల విగ్రహములు వెలసియుండుట ఇచటి ప్రత్యేకత. రాజధర్మమునకై తన సర్వస్వమును విరజిమ్మి "రామరాజ్య"మను శ్రేయోరాజ్యమును స్థాపించిన రఘురాముడు

పట్టాభిరాముడై కలియుగమున ధర్మపరిపాలనము గావించ ఇచట వెలసియుండెనాయనిపించును. రామగిరికి బహుసమీప గ్రామమైన పానగల్లులో సుప్రసిద్ధ సోమేశ్వరాలయములు వెలసియుండుట వారధి దాటుటకుముందు రాముడు శివార్చన గావించెనను త్రేతా యుగమునాటి చరిత్రను రాముని శివభక్తిని వెల్లడించుచున్నది. యుగాలనాటి భక్తి సహవాస సంబంధములు విడలేక నరులతో పాటు వానరులు అధికసంఖ్యలో నిజనివాసులట్లు రామగిరిలో ప్రబలియుండుట మరియొక ప్రత్యేకత. వైష్ణవక్షేత్రములందు వానర వాసముండుట సర్వసాధారణమే, అయిన ఇచటి వానర చమత్కార మునకు నమస్కారము చేయనలెననిపించును. "రాక్షస సంహారమున రామచంద్రమూర్తికి తోడ్పడినది నరులుకాదు. వానరులే కదా. అందుకని నరులకన్నా వానరులమగు మేమే మిన్న" అని ప్రగల్భించుచున్నవా యన్నట్లు కోతిమూక రామగిరిలో స్వేచ్ఛా విహారము సేయుచుండును. ద్వాపరమున తమ స్వామిని అనుక రించుచున్నట్లు వస్త్రాలను అపహరించి ఇండ్లకప్పులపై చెట్ల కొమ్మలపై కూర్చుని ఆహారమును సమర్పించువరకు గుడ్డలు వద్ద పెట్టుకుని ఆలస్యమైనచో చింపునట్లు నటించుచు కృష్ణలీలలు స్ఫురింపజేయుచు వినోదముగా వేదించుచుండును. నరులకిట్లు వేదాంతమును నేర్పుటకన్నట్లు వైష్ణవ క్షేత్రములందు వానరజాతి నెగడుచుండును. వానర భక్తి సాటిలేనిది. యుగాంతరమైనది. శ్రీరామ ప్రీత్యర్థము భక్తులును క్షేత్ర నిర్వాహకులును క్షేత్రము లందు నివసించు వానర సంఘమునకు నారికేళఫలాది ఆహారములు నిత్యము సమర్పించుట పుణ్యప్రదమని తోచును.

ఈ రామాలయ నిర్మాణము ఒక చక్కని కట్టడము. విశా లోన్నత ముఖద్వారము, దానికి ముందు విశాల ప్రాంగణము,



శ్రీ ఆండాళ్ అమ్మవారు, రామగిరి.
శ్రీమతి రిందాదేవిగారి స్వప్నసాక్షాత్కారిణి ప్రతిష్ఠాపన ది. 2-5-1956.

అందొక చక్కని మంటపము, ధ్వజస్తంభము, ఉత్తరద్వారము ఇత్యాదులు హైందవ మత సంస్కృతిని ప్రకటించుచున్నవి. ముఖ ద్వారమునుండి ఆలయాంతర్భాగము ప్రవేశించగానే ప్రశాంత వాతా వరణము స్ఫురించును. ఏదో చీకటినుండి వెలుతురు లోనికి వచ్చి నట్లు వర్షానికి ఆవరణము నాశ్రయించినట్లు మండుటెండనుండి శీతల తరుచ్ఛాయలకు చేరుకున్నట్లు భక్తులకు మనశ్శాంతి కలుగు చుండును. ఆలయాంతర్భాగమున ఎత్తైన వేదికావరణ నిర్మాణము హరికథాపురాణ కాలక్షేప కార్యక్రమములు జరుపుకొనుటకు బహు భక్తజన సమూహమున కనుకూలముగా సువిశాల ప్రాంగణము కలదు. శివాలయమున కభిముఖమై నందీశ్వరుడున్నట్లు శ్రీ స్వామి వారికభిముఖమై శ్రీ ఆంజనేయస్వామి చిన్నగుడిలో వెలసియున్నాడు శ్రీ స్వామివారి గర్భగుడికి కుడిప్రక్కన శ్రీ పెరుమాళ్లవారి గుడి ఎడమప్రక్కన శ్రీ అండాలమ్మవారిగుడి వెలసియున్నవి. శ్రీ అండాళ్ అమ్మవారు బహుభక్త జనాకర్షణీయముతో విరాజిల్లు చున్నది. విగ్రహమత్యంత సుందరశిల్పకళాశోభితయై అనంత దివ్యతేజోవంతమై సమస్త కళ్యాణముల ప్రసాదించు మంగళ దేవతామూర్తిగా వెలసియున్నది. సుదూర ప్రాంతములనుండి భక్తజనులు తమ మ్రొక్కుబడులు చెల్లించుటకువచ్చి అమ్మవారిని అర్చించి ధన్యులగుచున్నారు. మార్గశీర్షములో శ్రీ అండాళమ్మవారి కళ్యాణ మహోత్సవము వైష్ణవమత సిద్ధాంత రీతిగా వైభవోపేత ముగా నేత్రోత్సవముగా జరుగుచుండును.

సీతా లక్ష్మణ భరత శత్రుఘ్న ఆంజనేయ సమేతుడై శ్రీరామ చంద్రస్వామి ప్రతిదినము అర్చన సంసేవాది ఉత్సవాదులతో బహు భక్తజనుల నాకర్షించుచు భక్తజనాభీష్టముల నీడేర్చుచున్నాడు. శ్రీరామనవమి ఉత్సవమత్యంత వైభవోపేతముగా జరుగుచుండును.

వందలాది భక్తజన సమ్మర్ధముతో ఆలయ బహిరంతర్భాగము లందు క్రిక్కిరిసి పోవుచుండును. శ్రీస్వామివారి కళ్యాణ మహోత్స వము కన్నుల పండువుగా జరుగుచుండును. మధుర మంగళ తూర్యా దులు, వేదమంత్ర ఘోషలు, శాస్త్రచర్చలు, సంగీతసాహిత్య సభలు, పురాణాది హరికథా కాలక్షేపములు మొదలగునవి కడువేడుకగా జరుగుచుండును. ప్రతిదినము ప్రాతఃసాయంకాలములయందు మం గళగీతములు మధుర మధుర కంఠములతో వినిపించుచు ప్రసన్న ప్రశాంత పవిత్ర వాతావరణమును సృష్టించుచుండును. యాత్రికుల సౌకర్యార్థము ఆలయమందు వసతి గదులు కొల్లాయిలు కలవు. సువి శాలమైన ఆలయాంతర్భాగమున పెద్దఎత్తున శ్రీ ఆండాళ్ అమ్మ వారి పేరిట కాలక్షేపమంటప నిర్మాణము జరుగుచున్నది.

రామగిరిలో వెలసిన కనకదుర్గా రామాలయముల గురించి మాత్రము ప్రస్తావించుటే నా లక్ష్యమైన ఈ మండలములోగల తదితర దేవాలయములగురించి నేనెరిఁగినంతవరకు క్షేత్ర దృష్టితో హైందవమత సాంస్కృతిక చారిత్రకాంశముల స్పృశించుచు కొంత ముచ్చటింతును.

**పానగల్లు :-** రామగిరికి అతిసమీప గ్రామమైన పాన గల్లులో రెండు సుప్రసిద్ధ పురాతన శివాలయములును ఒకటి శ్రీ వెంకటేశ్వరాలయమును వెలసియున్నవి. శివాలయములలో ఒకటి పచ్చల సోమేశ్వరాలయము మరొకటి ఛాయా సోమేశ్వరాలయము పేరులోనే ఏదో విశేషము దాగియున్నట్లు తోచును. పచ్చల సోమే శ్వరాలయమునందు ప్రాచీన శిల్పకళావైభవము ఛాయా సోమేశ్వ రాలయమునందు ఆధునిక శాస్త్రవేత్తలు సయితము శ్లాఘింపదగు అద్భుత శిల్పశాస్త్ర విజ్ఞాన కౌశలములు ప్రదర్శింపబడినవి. అతి ప్రాచీనతరమై కన్పట్టు ఛాయా సోమేశ్వరాలయము శిథిలావస్థలో

పూజార్చన సంస్కారాదులు లేకయున్నను కేవలమిందలి నిగూఢ మైన అనల్ప శిల్ప శాస్త్రవిజ్ఞాన వైభవాద్భుతమొకటి యాత్రికుల నాకర్షించుచు దర్శింపబడుచున్నది. దీని పునరుద్ధరణమెంతైన అవసరము.

పచ్చల సోమేశ్వరాలయమునందలి శిల్పసౌందర్య మింతింత యని చెప్పనలవికాదు. జీవకళ ఉట్టిపడు నందీశ్వరుని విగ్రహమిచట చూడ ముచ్చటగొల్పును. భారత రామాయణగాథలు, యుద్ధ ప్రక్రియలు చతురంగసేనాబలాలు, నటరాజాది దేవతామూర్తులు స్తంభాలపై రాతి గోడలపై చెక్కబడి జీవకళలుట్టిపడుచు నాటి శిల్పాచార్యుల అద్భుత శిల్పకళాకౌశలమును నాటి కళాపిపాసను కళాపోషణను వెల్లడించుచున్నది. ఇందలి శిల్పము చాళుక్య, కాకతీయ సాంప్రదాయముల బోలియున్నది. ఈ శిల్పము చూచి ఆనందించ వలసినదేకాని చెప్పనలవికాదు ఇచటి లింగమునకు ఒక పెద్ద పచ్చ పొదగబడి యుండెడిదనియు పచ్చల హారాలతో స్వామి నలంకరించెడి వారనియు అందుచే పచ్చల సోమేశ్వరాలయమను పేరు గలిగినదనియు జనశ్రుతి కలదు. ఇచటికి సమీపమున వెలసిన శ్రీ వెంకటేశ్వరాలయము సువిశాల ప్రాంగణము కలది దర్శనీయమైనది. పానగల్లుకు పూర్వచరిత్ర కలదు. చాళుక్య సామంతుల రాజధానిగా వెలసి ఉదయాదిత్యుడను చాళుక్య ప్రభువుచే పాలింపబడెనని చెప్పుదురు.

యాదగిరి :- ఇంక జగత్ప్రసిద్ధమై వెలసిన శ్రీ యాదగిరి లక్ష్మీనరసింహస్వామివారి పుణ్యక్షేత్రమును గురించి ప్రస్తావించిన ఒక గ్రంథమేయగును. ఈ మహాక్షేత్రము నల్లగొండజిల్లా భువనగిరి తాలూకాలో తిరుమలగిరివలె అత్యున్నతగిరి శిఖరాన వెలసియున్నది. ఇది అత్యంత ప్రాచీనతరమై బహుభక్త జనాకర్ష

ణీయమై విరాజిల్లుచున్నది. అనుదినము భక్తజనులు తండోప తండములుగా వ్యయప్రయాసలకోర్చి సుదూర ప్రాంతములనుండి (ఇతర రాష్ట్రములనుండికూడ) వచ్చి శ్రీ స్వామివారిని సందర్శించుకొని మొక్కుబడులు చెల్లించుకొనుచు శ్రీ స్వామివారి దయకు పాత్రులగుచు ధన్యులగుచున్నారు. దీనబంధువై దయాసింధువై ఆశ్రితజన కల్పతరువై భక్తజనుల యభీష్టము లీడేర్చుచు వెలసి యున్న శ్రీ లక్ష్మీనరసింహస్వామివారి మహిమలు అనుభవైక వేద్యమేకాని వర్ణింపనలవికాదు. ఈ క్షేత్రమున దేవాదాయ సంస్థ వారు యాత్రికుల సౌకర్యార్థము తగు వసతులు సమకూర్చి సమర్థనీయముగా నిర్వహించుచున్నారు. ఇచ్చట కళ్యాణాది శుభకార్యములు స్వామిసన్నిధిలో కడువేడుకగా జరుపుకొనుచుందురు. శ్రీ స్వామివారికి నిత్యకళ్యాణము పచ్చతోరణముగా అర్చన సంసేవాది ఉత్సవాదులు అత్యంత వైభవోపేతముగా ప్రతిదినము జరుగుచుండును.

ఓడపల్లి : ఈ జిల్లా మిర్యాలగూడెం తాలూకాలో గుంటూరు బార్డరు గ్రామము. ఓడపల్లిలో మూసీ కృష్ణా సంగమమున అగస్త్యమహర్షి స్థాపితమని చెప్పబడు ఒక శివాలయమును దీనికి సమీపమున శ్రీ లక్ష్మీనరసింహాలయమును అవశ్యదర్శనీయములు ఈ ఆలయములు అతి పురాతనములు. ఇందలి మహిమావృత్తములు అనిర్వచనీయములు. శివాలయమందలి లింగము శిరమున పెద్ద రంధ్రమున్నది. దీనికొక కథ చెప్పుదురు. వేటకానిచే తరమబడుచు ఒక పక్షి శివునాశ్రయించెనని ఆశ్రితావనుడైన పరమశివుడు పక్షినికాక మరేదైన కోరుకొమ్మని వేటకానినడుగగా అందుకు వాడు శివుని మెదడు కోరెనని దానికి పరమేశ్వరుడు తన హస్తముతో తన మెదడు తీసి వానికిచ్చి పక్షిని రక్షించెనని

చెప్పుదురు. శ్రీ నరసింహాలయమున విగ్రహమునకెదురుగా చెమ్మలో వెలిగింపబడిన దీపము ప్రకంపితమగుచుండును. దీనికి శ్రీ స్వామివారి ఉచ్ఛ్వాస నిశ్వాసలు కారణమందురు.

జీడికల్లు-విట్టపల్లి : ఇవన్నియుకాక సూర్యాపేట తాలూకాలో పిల్లలమఱ్ఱి, నాగులపహాడ్ గ్రామాలలోని ఆలయాలు, సుందర శిల్పాలు మరియు లేడిని కొట్టిన స్థలమనబడు జీడికల్లులోని రామాలయము మరియు హుజూర్‌నగర్ తాలూకాలో మహిమాన్వితమైన శ్రీ లక్ష్మీనరసింహస్వామి ఆలయము మొదలగునవి శిల్పకళానైపుణ్యముతోపాటు హైందవమత సాంస్కృతిక చారిత్రకాది పూర్వవైభవములు చాటుచున్నవి.

నాగార్జునసాగర్ : నల్లగొండ అనగానే నాగార్జున సాగరము స్ఫురణకు వచ్చును ఇది ప్రపంచ నిర్మిత మహా జలాశయములలో నొకటి. ఆంధ్రులపాలిటి కల్పతరువు. రెండువేల సంవత్సరాలకు పూర్వము నాగార్జునాచార్యుడు విహరించిన విజ్ఞాన భూమి ఇది. మానవాళికి నవజీవమును ప్రసాదించు ఈ నాగార్జున సాగరమును తిలకించునపుడు

" నాగార్జునసాగర మానవ జీవన భాగ్యరమా!
దుర్భిక్షదావాగ్నులార్ప దూకివచ్చు నిర్ఝరమా!
తథాగతుని బోధామృత ధారాకాసారమా!
శాంతిసౌఖ్యముల గూర్చెడు సౌజన్యతరంగమా!
కర్షకనయనాల గురియు హర్షబాష్పపూరమా!
క్షేత్రపీమ ప్రవహించెడు చేతనా ప్రవాహమా! "

అని అనిపించును. ఈ నాగార్జునకొండ పూర్వమొకప్పుడు తక్షశిల నలందలవలె శ్రీ పర్వతమను పేరుతో జగత్ప్రసిద్ధమై విద్యాకేంద్రమై విదేశాలనుండి విద్యార్థులను, యాత్రికులను విజ్ఞానసముపార్జనకై ఆకర్షించుచుండెడిది.

**పెందోట :** నాగార్జునకొండకు అతిసమీపమున నేడు రూపరిన "పెందోట" కలదు. పెండోట ఒకప్పుడు శ్రీకాకుళము, ధాన్యకటకము, అమరావతివలె మహానగరమై వేదవేత్తలగు మహా శిల్పాచార్యుల కాలవాలమై ఆంధ్రౌన్నత్యమును దిగంతాలకు చాటి నది. విశ్వకర్మ పురాణములో సయితము ప్రశంసింపబడి విశ్వజ్ఞ సగోత్రకులగు విశ్వబ్రాహ్మణ ప్రభువులచే పరిపాలింపబడిన పెందోటయందు త్రవ్వకములు సాగించినచో ఆంధ్రచరిత్ర నిర్మా ణమున కాధారములగు వాస్తు శాస్త్ర విజ్ఞానాది ప్రాచీన చిహ్న ములు దొరుకును. పెందోట ప్రభువులలో మార్కండేయ ప్రభువు ప్రసిద్ధుడు. ( క్రీ. శ. 1385 ప్రాంతము ) ఇతడు తుర్కరాజకవి అయ్యంకి బాలసరస్వతి అను విఖ్యాతకవుల పోషించి వారిచే స్కాందపురాణాంతర్గతమగు నాగరఖండమును తెలుగు చేయించి తానంకితమొందెను. ఇందు పెందోట చరిత్రము కృతిపతి చరిత్రము దెల్లమగును. పెందోట చరిత్రము ఆంధ్రదేశ చరిత్ర రచనకు తోడ్పడగలదు. ( శ్రీ కొండూరి వీరరాఘవాచార్యులవారి వ్యాసము పెందోటపురము - మార్కండేయ ప్రభువు - భారతి ) ఇంతేగాక నాగార్జునకొండకు సమీపమున వెలసిన విజయపురి.

**విజయపురి :** 'విజయపురి' ఆంధ్రుల రాజధానియై ప్రాచీనకాలములో విదేశ వాణిజ్యకేంద్రముగా వెలసినట్లు నిదర్శ నములున్నవి. రెండువేల సంవత్సరములనాటి రోము దేశపు బంగారు నాణెములిచట లభించినవి వాటిపై 'పస్తీనా' మహారాణి పేరు లాటిన్ భాషలో చెక్కబడియున్నది. (Free press Jour -nal Date 5-4-1957) ఒకవైపు నాగార్జునకొండ మహాయాన బౌద్ధమత కేంద్రమై మరొకవంక ఆలేరు బ్లాక్‌లోగల కొలనుపాక వున్నవి.

కొలనుపాక : ఇది వర్ధమాన మహావీర జైన మత కేంద్రమై వెలసి యుండెడిది. కొలనుపాకలో కొన్ని ప్రాచీన తరములైన శైవ వైష్ణవ దేవాలయములు వెలసియుండుట నాటి మత సామరస్యతను వెల్లడించును. ఇచట నేటికిని పురాతన శిలా ఖండికలు దేవతా విగ్రహములు లభించుచున్నవి. ఇచటి జైనాలయము చాలా గొప్పది. దూరప్రాంతములనుండి జైన మతస్తులు వచ్చి దర్శించుచుందురు. శ్రీ మహావీర విగ్రహము చాలా గొప్పదై "ఫిరోజ్" అను గొప్ప విలువైన రాతితో అపురూపముగా శిల్పించబడినది. ఈ ఆలయము తగు సౌకర్యములతో నిర్వహింపబడుచున్నది.

నీలగిరి : 'నీలగిరి' అని నల్లగొండకు మొదటి పేరు. నీలగిరి పత్రిక తెలంగాణములో మొదటి పత్రికగా 1921-22లో వెలువడినది. శ్రీ షబ్‌నవీస్ వెంకటరామ నరసింహారావుగారు దీనికి మొదటి సంపాదకులు. బండ అచ్చుతో పత్రిక వెలువడెడిది. భూమాత పయోధరాల మధ్య మెరిసే మణిహారమట్లు నల్లగొండ నగరము రెండు పెద్దకొండల మధ్య వెలసియున్నది. ఒకటి లతీఫ్ సాహెబ్ గుట్ట :- దీనిమీద దర్గాతోపాటు శివాలయము కూడా యున్నది. దీనికి పడమటి కొసన బ్రహ్మంగారి గుడి బూరుగు మానులో వెలసియున్నది. రెండవది కాపురాలగుట్ట. దీనిపైన కోట మరియు కాపురాలు చేసిన ఇండ్లు శిథిలావస్థలోనున్నవి.

కోటలు : నల్లగొండలోని కోటల గురించి ముచ్చటించిన వేరొక చారిత్రక గ్రంథమగును. దేవరకొండ రాచకొండ కోటలు వెలమ వీరుల స్థావరాలై దుర్భేద్యములై ఒకప్పుడు గోలకొండ, కొండవీడు, విజయనగర రాజ్యములకు దీటుగా

నిలిచినవి. వెలమ దొరల కోటలు నేటికిని నాటి రాజకీయ సాంఘిక సాంస్కృతిక చారిత్రకాది ప్రాభవముల జాటుచున్నవి.

**రాచకొండ :** రాచకొండ పాలకుడు సింగభూపాలుడు సర్వజ్ఞ బిరుదాంకితుడు, మహా పండితుడు, నాట్య శాస్త్రకర్త, సరసుడు. పోతన మహాకవి భోగినీ దండకము రచించిన దీతని యాస్థానమునందే భాగవతమును తనకంకితమిమ్మని కవిని కోరిన దీతడే. కొండవీడు రాచకొండ రాజులకు వైరముండెడిది. కొండవీటి రాజాస్థాన కవి శ్రీనాథ మహాకవి రాచకొండను దర్శించి తన కవితా శక్తిని ప్రదర్శించి తన ప్రభు భక్తికి న్యూనత కలుగకుండునట్లుగా సింగభూపాలుని పొగడ్తలతో ముంచెత్తించి మెప్పించి కొండవీటి రాజుల గౌరవ చిహ్నమగు "సందికంత పోతరాజు" అను కత్తిని విడిపించుకొని పోయెను. ఈ సందర్భమున శ్రీనాథుడు తన పలుకునకు రెండంచుల పదను పెట్టి చెప్పిన పద్యములు నేటికిని రాచకొండలోనేకాక అఖండ మహాంధ్రదేశమంతట ప్రతిధ్వనించుచున్నవి.

సర్వజ్ఞ నామ ధేయము
శర్వునకే రావుసింగ జనపాలునకే
యుర్విన్ జెల్లును; దక్కొరు
సర్వజ్ఞుండనుట కుక్కసామజమనుచే.

( "జన పాలునకే యుర్విన్‌జెల్లు" నన్నప్పుడు రాజునకు సమ్మానము. "జనపాలునకు ఏ యుర్విన్ జెల్లు"? అన్నప్పుడు రాజునకు అవమానము )

ఆస్థాన కవులిచ్చిన సమస్య - శ్రీనాథుని పూరణము

ఉ॥ తక్కక రావుసింగవసుధావరు డర్థుల కర్థమిచ్చుచో
దిక్కులలేని కర్ణుని దధీచిని ఖేచరు వేల్పు మ్రాను బెం
పెక్కిన కామధేనువు శిబీంద్రుని నెన్నెదుభట్టః దిట్టవై
"కుక్కవా। నక్కవో। ఫణివా। కోతివా। పిల్లివా। భూత
పిల్లివో"

మీ బిరుదులేవి యని అడిగినప్పుడు :-

చ॥ తరువున గాండివంబిడదె
ధర్మజు నాన కిరీటి యేన వా
క్సరసిజ నేత్రయానతి వి
చారము చొప్పునఁ గర్వహీనతన్
మరలి తెలుంగు భూమికి స
మాన గతింగొని పోవు వాడనై
బిరుదులు నారి వాగుకడఁ బెట్టితి
సత్కవి సార్వభౌముఁడన్।

సభారంభంలో శారదాస్తుతి

సీ॥ దీనారటంకాల దీర్థ మాడించితి
దక్షిణాధీశు ముత్యాలశాలఁ
బలుకు తోడై తాంధ్ర భాషా మహాకావ్య
నైషధగ్రంథ సందర్భమందుఁ
బగుల గొట్టించి తుద్భట వివాదప్రౌఢి
గౌడ డిండిమభట్టు కంచుఢక్క
చంద్రశేఖర క్రియాశక్తి రాయలయొద్దఁ
బాదుకొల్పితి సార్వభౌమ బిరుదు
యెటుల మెప్పించెదో నన్ను నింకమీద
రావుసింగ మహీపాలు ధీవిశాలు
నిండుకొలువున నెలకొని యుండి నీవు
వరస సద్గుణ నికురంబ శారదాంబ।

(క్షేత్ర చారిత్రక రచన)

# భద్రగిరి క్షేత్రము

భద్రాచలం ఖమ్మం మండలంలో వెలసిన జగత్ప్రసిద్ధమైన పుణ్యక్షేత్రం. ఇది ఖమ్మం నగరానికి ఈశాన్యదిశన 135 కి. మీ. దూరాన గోదావరీ వామ తీరాన వెలసినది. భద్రాచలం దక్షిణాపథ మధ్యస్థలం. 'Heart of the Deccon' అని బ్రిటిషువారు దీనిని పేర్కొన్నారు. రామాయణంలో పేర్కొనబడిన దండకారణ్యామీ ప్రాంతమేనని చెప్పుదురు. బ్రహ్మాండాది పురాణాలలో ఈ దివ్యక్షేత్రం పేర్కొనబడినది. తెలుగువారిదేవుడైన శ్రీరాముని నిలయంగా వెలసినభద్రాచలాన్ని గురించి తెలియని తెలుగువారుండరు.

ఈ క్షేత్రానికి ప్రత్యేకమైన చారిత్రక సాంస్కృతిక ప్రాముఖ్యత కలదు, రాముడు సీతాలక్ష్మణ సమేతుడై వనవాసంలో ఇచట కొంతకాలం గడిపినాడని ఈ భద్రాచలానికి 35 కి. మీ. దూరంలో గోదావరీ తటి ప్రాంతాన పర్ణశాలను నిర్మించుకొని నివసించెనని ఇచటనే రావణుడు సీతను దొంగిలించెనని చెప్పుదురు. ఈ ప్రాంతానికి సమీపంలో ఏటపాక (జటపాక) అను గ్రామం కలదు. ఇచ్చటనే రావణునెదిరించి పోరాడి పడిపోయిన జటాయువునకు రామలక్ష్మణులు గోదావరీ జలంతో నివాపములు విడిచిరి. వాల్మీకి రామాయణంలో చెప్పబడిన గోదావరీ పర్ణశాల (పంచవటి) మరియు దండకారణ్యాది ప్రదేశాలు నిదర్శనాలుగా నేటికి ఇచట వెలసియున్నవి.

**గోదావరి :** పడమటి కనుమలలో నాసిక్ దగ్గర త్రియంబకమనుచోట పుట్టి తూర్పుదిశగా ప్రవహిస్తూ గోదావరీనది భద్రాచలానికి పశ్చిమసమీపాన ఉత్తరంనుండి దక్షిణముగా ఉష్ణగుండం వరకు ప్రవహించును. అటనుండి తూర్పుగా ప్రవహిస్తూ పాపికొండల వరకు ఉత్తరదిశ పట్టి అటనుండి తూర్పుగా ప్రవహిస్తూ సముద్రము

చేరబోవును. ఇట్లు మలుపులు తిరిగి భద్రాచలం వద్ద గోదావరి మూడు దిక్కుల చుట్టుముట్టి యుండుట వలన ఈ క్షేత్రానికి గోదావరి ప్రదక్షిణము చేయుచున్నదా అనిపించును. రెండు క్రోసుల వరకిచట గోదావరీ జలం అత్యంత పవిత్ర తీర్థముగా భావించబడినది. భద్రాచల క్షేత్రంలో మూడు రోజులు నిద్రచేసిన భక్తులకు విష్ణుప్రాప్తి కలుగునని గౌతమీ మహాత్మ్యమందు చెప్పబడినది.

శ్రీమద్భద్ర శిలోచయస్య పరితః
క్రోశద్వయాభ్యంతరే
తీర్థాన్యర్బుద సంఖ్యయా త్రిజగతాం
సారాణి రామాజ్ఞయా
నిత్యం సన్నిహితాని సంతినితరాం
గోదావరీపార్శ్వయోః
తస్మాదత్ర దినత్రయాం వసతియః
ప్రాప్నోతి విష్ణోః పదం

పర్ణశాల :- భద్రాచలం దర్శించవచ్చిన యాత్రికులు పర్ణశాలకు వెళ్ళివస్తుంటారు. అచట చిన్న రామాలయమున్నది, అచటి రాముడు శోక రాముడు. సీతను రావణాసురుడు ఎత్తుకపోయిన సంఘటన అక్కడే జరిగింది. పర్ణశాల గోదావరికి ఒక ఒడ్డున ఉంటే దానికెదురుగా మరొకఒడ్డున ఒకపెద్దగుట్ట ఉన్నది. దానిని రథపు గుట్ట అంటారు. సీతను దొంగిలించుటకై వచ్చిన రావణుడు ఆ గుట్టపై విమానాన్ని ఆపునప్పుడు రాపిడివల్ల ఏర్పడిన చారలు నేటికి కనిపిస్తున్నవి. పర్ణశాలకు దగ్గరే ఒకగుట్టఉంది, దానిని

లక్ష్మణకొండ అంటారు. సీతమ్మకొరకు లక్ష్మణుడు బాణంవేసి ఆ
కొండనుండి జలవాహినిని తెప్పించాడు దానిని "సీతవాగు"
అంటారు. అందులో సీతమ్మ స్నానమాడేదని అచట నారచీరలు
ఆరవేసికొనేవారని, అచట ఎరుపు పసుపురంగురాళ్ళు ఉండుటచేత
సీతమ్మ వాటిని రంగరించి పసుపు కుంకుమగా వాడుకునేది అని
అంటారు. అచట ఒక గుహావుంది. రాముడు ఖరదూషణాది
రాక్షసులతో యుద్ధం చేస్తుండగా సీతను ఆ గుహలోనవుంచి లక్ష్మ
ణుడు కాపలాగానుండెనని చెప్పుదురు. పర్ణశాలకు సుమారు
8 కి. మీ. దూరంలో దుమ్ముగూడెం అని ఒక ఊరుంది. అచట
ఖరదూషణాది రాక్షసులతో రాముడేకైకవీరుడై ద్వంద్వయుద్ధం
(దొమ్మీయుద్ధం) చేసాడని అందుకే దానికి దొమ్మీగూడెం అను
పేరువచ్చిందని లేక ఆ పోరువల్ల అచట దుమ్ము రేగుటవల్ల ఆ
చోటున వెలసిన గ్రామానికి 'దుమ్ముగూడెం' అనుపేరు వచ్చిందని
చెపుతారు. దీనికెదురుగా ఆవలియొడ్డున జటాయువు గుట్టకలదు.
కనుక జటాయువు రావణుల దొమ్మీయుద్ధంవల్ల ఈ చోటుకు
'దొమ్మీగూడెం' అనుపేరు వచ్చెనేమో! ఇట్లా ఎన్నెన్నో గుర్తులు
నాటి చరిత్రకు నిదర్శనాలుగా నిలచి చూపరుల నాకర్షిస్తున్నవి
ఇవికాక భద్రాచల సమీప ప్రాంతంలో గల ఏటపాక గ్రామంలో
జటాయువు రావణునెదుర్కొని వానితో పోరాడి వాని ఖడ్గ ప్రహా
రాలకు బలియై వీరమరణమందిన ఘట్టం స్ఫురణకు రాగానే రోమాం
చమగును. ఒక నిస్సహాయ నబలను రక్షించే యత్నంలో
తనప్రాణాలనుకూడ లెక్కచేయక మానవతా ధర్మానికై దురా
క్రమణము నెదుర్కొని బలియైపోయిన పక్షివీరునకు జోహారులు.

నేటి మానవజాతిలో జటాయువులాంటి వీరులెందరున్నారు?
నేటిసమాజంలో దురాగతాలనెదురించు ధీరులెందరున్నారు? సాజ

న్యాయానికై సమరంలో అమరుడైన జటాయువుగాధ జనసంక్షూన్ని
ఉద్ధరించే చేతనామృతబోధ!

పరిశీలన:- పర్ణశాల యెక్కడ? భద్రాచలం ప్రాంతమా? లేక
నాసిక్ ప్రాంతమా? అనునది వివాదాస్పదమైయుండగా భద్రాచలం
యొద్ద గోదావరికి ఏ తీరాన పర్ణశాల? కుడియొడ్డుననా లేక ఎడమ
యొడ్డుననా అనునది ప్రస్తుత చర్చనీయాంశము. భద్రాచలం పర్ణ
శాలయొద్ద గోదావరి ఉత్తరంనుండి దక్షిణానికి ప్రవహించును.
ఇప్పుడున్న పర్ణశాల గోదావరికి తూర్పుతీరాన అనగా ఎడమ
ఒడ్డునకలదు. కాని దీనికెదురుగా ఆవలిగట్టున అనగా పశ్చిమ
తీరాన కుడి యొడ్డున రథపుగుట్ట కొట్టవచ్చినట్లు కనిపించును.
దానికి సమీపముననే పర్ణశాల యుండెననుటకు తగిన కారణములు
ఉన్నవి. (రథపుగుట్టలో రథముదాచి ఏఱుదాటి ఏటికావలి యొడ్డున
కల సీతనెత్తుకొని ఈవలి యొడ్డునకు వచ్చి రథముపై నెక్కించు
కొని పోయెననుట సాగదిసని) రామలక్ష్మణులు లేని అదనుచూచు
కొని రావణుడు పర్ణశాలను సమీపించలేదు. ఈవలి యొడ్డున నుండి
ఆవలియొడ్డునకల పర్ణశాలలో ఇదిగమనించుట కష్టము కనుక
రథపుగుట్టపై తేరునాపి గుట్టపైనుండి పొంచి దానికింద సమీపంలో
నున్న పర్ణశాలను అదనుచూచి సమీపించి సీతనెత్తుకుని వెంటనే
దగ్గరనున్న విమానముపై నెక్కించుకొని పోయెను. రామాయ
ణంలో సీతను దొంగిలించునపుడు తేరు సిద్ధముగా యుండెనని
తటాలున నెక్కించుకొని ఆకాశమున కెగసిపోయెనని ఉన్నది.
కనుక రథపుగుట్ట సమీపములోనే పర్ణశాల యున్నదనుట సహజ
మని తోచును రెండవది ఈ రథపుగుట్ట సమీపంలో సీతగుట్టఅను
పర్వతమున్నది. దీనికింద పడమటివైపున పెద్దబయలున్నది.

అందు ఖరుని పదునాలుగువేల రాక్షసులతో రాముడొక్కడు పొమ్మిపోరు చేయుచుండగా సీతాలక్ష్మణులు సీతగుట్టలు పర్వతము పైనుండి చూచిరి. అట్లుచూచినా కనిపించునుకూడ. ఈ పర్ణశాలకు దక్షిణదిశకు సుమారు 10 కి.మీ దూరాన సరిగా దుమ్ముగూడెం= ధూమగూడెం=ధూమము పొగ. ధూమజము=మబ్బు. ధూమ్యాటము=పక్షివిశేషము. రావణుడు మాయచే పెనుగాలిని మబ్బులను సృష్టించి వాటిచాటున నెవరికి కానరాకుండా సీతనెత్తుకొని ఆకాశమార్గమున పోయెనని రామాయణంలో రామునితో జటాయువు అంటాడు. అందుకే ధూమ ధూమజములు కల్పించిన ఈ చోటుకు ధూమగూడెమని పేరువచ్చెనేమో! ధూమగూడెం దుమ్ముగూడెంగా మారి యుండవచ్చును.) దుమ్ముగూడాని కెదురుగా పశ్చిమ తీరాన ఒక చిన్నగుట్ట (జటాయువుగుట్ట) ఉన్నది దీనికి సమీపాననే జటాయువు రావణయుద్ధం జరిగియుండును. మూడవది రామాయణాన్నిబట్టి పర్ణశాల సమీపంలోనే పద్మసరస్సు ఉండవలె. ఇచ్చోట పెద్ద చెరువున్నట్లు చెప్పుదురు. నాలవది సీతాన్వేషణలో మృగములు దక్షిణమార్గము జూపును. ఏరడ్డమగుట కొంత నైరుతి దిక్కుగా బోయిరి. జటాయువుకూడా దక్షిణమార్గము జెప్పును అప్పుడు కూడ నైఋతి మూలగ కొంతదూరముపోయి మూడు కోసులు దూర్పుగా వెళ్ళిరని రామాయణము. అట్లు వచ్చుటచే భద్రాచలంయొద్ద గోదావరికి దక్షిణదిశకు చేరుకొని ఏరుదాటకయే పంపకు (కిష్కిందకు) పోవు మార్గము బట్టిరి. గోదావరి దాటినట్లు వాల్మీకి చెప్పడు పర్ణశాల గోదావరి తూర్పుతీరాన యుండినచో నైరుతికి వెళ్ళడానికి ఏరడ్డమై వీలుపడదు! కనుక ఇప్పుడున్న పర్ణశాల కెదురుగా గోదావరికి కుడియొడ్డున అనగా పశ్చిమ తీరాన పర్ణశాల యుండెనని ఇది రామాయణ సమ్మతమని శ్రీ వాసు

దాసస్వామి రామాయణం సమర్థించుచున్నది ఏటికే యెడ్డున
నైతేనేమి కాని ఒకటిమాత్రం నగ్నసత్యంగా కనిపించును. సీత
పర్ణశాలలో కనుపించనందుకు పద్మములకోసుకొని తెచ్చుటకు
గోదావరికి పోయెనేమోయని రాముడనగా లక్ష్మణుడువెళ్ళి చూచి
వచ్చుట జటాయువుకు గోదావరి జలంతో నివాపములు విడుచుట
రామలక్ష్మణులు బట్టినమార్గములు ఈ స్థలమునకు సరిపోవుట
ఇవన్నియు రామాయణ విరుద్ధము కాకుండుట మొదలగు నంశ
ములనుబట్టి పర్ణశాల గోదావరితీరస్థమని అది ఇచ్చటనేయని తెల్ల
మగుచున్నది

నాసికలో పర్ణశాల రామాయణ సమ్మతము కాదనుటకు
సహేతుక వాదమున్నది. అదెట్లనిన రామాయణ ప్రకారం పంచ
వటినుండి రామలక్ష్మణులు దక్షిణదిశకు వెళ్లటానికి నైఋతిమూలగా
కొంతవెళ్లి మరల నైఋతిగాపోయి అచటినుండి తూర్పుగాపోయి
కబంధునిజంపి అచటనుండి పడమరగాపోయి పంప (తుంగభద్ర)
చేరుకొని దానికి పడమరనున్న శబరిగుహకుపోయి పిమ్మట పంపా
సరోవరం తిన్నగాదాటి దాని దక్షిణతీరాన ఋష్యమూక పర్వత
మున సుగ్రీవాదుల కలుసుకొందురు. నాసికాపంచవటినుండి ఇట్టి
మార్గములవలంభించినచో పంప-ఋష్యమూకపర్వతము (కిష్కింధ)
చేరకొనలేరు. ఒకవేళ నాసికావాదులన్నట్లువారాగ్నేయ మూలగా
పయనించిరన్న నదియు సాధ్యపడదు. అట్లుచేసిన సముద్రతీరము
చేరగలరు. కాని కిష్కింధ చేరలేరు. అదియునుగాక అగ్నేయ
ముగా పయనించినట్లు వాల్మీకి ఎక్కడా వ్రాయలేదు. నాసికా వాద
మును ఖండించు మరొక ప్రబలకారణమున్నది. లంకనువిడి
రామేశ్వరమునుండి అయోధ్యకు తిరిగి వచ్చునప్పుడు మార్గమధ్య
మున రాముడు సీతకు యెడమవైపున కిష్కింధను కుడివైపున

పంచవటిని చూపించును. నాసికలో పంచవటి యుండినచో అది (పంచవటి) యెడమవైపుకు కిష్కింధ కుడివైపుకు కాగలదు ఇది రామాయణ విరుద్ధము, ఇదికాక నాసికావాదము ప్రకారము చిత్ర కూటమునుండి దక్షిణముగా పశ్చిమాభిముఖులై నాసిక చేరు కొన్నచో వింధ్యపర్వతమును నర్మదాతపతులను దాటవలసియుం డును. అట్లు దాటినట్లు వాల్మీకి వ్రాయలేదు. అంత ప్రసిద్ధనదులను వ్రాయక విస్మరించునా? కనుక నాసికా పక్షవాదము వాల్మీకి రామా యణ విరుద్ధము, నిరాధారము.

( ఈ పరిశీలనకు ఆధారం 'ఆంధ్రవాల్మీకి' శ్రీవాసుదాసస్వామి రామాయణం) ఏదెట్లున్నను చరిత్రకారులింకను పరిశోధనలు జరిపి సత్యప్రదర్శనము గావింతురుగాక!

## మూల విగ్రహాలు :-

భద్రాచల దేవాలయములో సీతారామలక్ష్మణ విగ్రహాలు అత్యంత సుందరములు, దివ్యతేజోవంతములు. రామవిగ్రహం లోని ప్రత్యేకతను వర్ణించే ఈ శ్లోకమును అవధరించండి.

"వామాంకస్థిత జానకీ పరిలసత్కోదండ దండం కరే
చక్రం చోర్ధ్వకరేణ బాహుయుగళే శంఖం శరం దక్షిణే
బిభ్రాణం జలజాత పత్ర నయనం భద్రాద్రి మూర్ధ్నిస్థితం
కేయూరాది విభూషితం రఘుపతిం సౌమిత్రియుక్తంభజే"।

ఎక్కడైనా ద్విభుజరామ విగ్రహాలే కనిపించును. కాని ఇచటి రామవిగ్రహం చతుర్భుజములు కలిగి ముందు రెండు చేతు

లలో ఎడమచేత కోదండం కుడిచేత బాణం ధరించి వెనుక రెండు చేతులలో - కుడిచేత శంఖు ఎడమచేత చక్రం దాల్చి ఉండటం విశేషం. మహావిష్ణువు వలె ఇట్లా "చతుర్భుజరాముడు" కనిపించడు అరుదు, ఇట్టి విగ్రహం పూజకు అతిముఖ్యము మరొక విశేషమేమనగా విష్ణువునకు కుడిచేత చక్రం ఎడమచేత శంఖు ఉండటం సహజం, దీనికి విరుద్ధంగా ఈ రాముని కుడిచేత శంఖు ఎడమచేత చక్రం ఉంది. ఇందులకు కారణం రావణాది రాక్షసుల వధించిన తరువాత చక్రంతో పనిపూర్తి అవగానే దానిని తన వామహస్తాన ధరింపచేసి శిష్టసంరక్షణార్థం శాంతి పంస్థాపనార్థం శంఖును తన దక్షిణ హస్తాన ధరించెనని అంటారు. దివ్యత్వముట్టిపడే ఇచ్చటి సీతారామలక్ష్మణ విగ్రహాలు సామాన్య స్థపతి నిర్మితాలు కావని పించును. దర్శనమాత్రాన సర్వజగముల మరపించి దివ్యానుభూతిని కలిగించి సాష్టాంగపడి ప్రణమిల్లజేయు భక్తిరసావేశముప్పొంగజేయును.

భద్రగిరి చరిత్ర :- పూర్వము బ్రహ్మ వరప్రసాదమున మేరువు మేనకలకు భద్రుడను మహాత్ముడు జన్మించెను. భద్రుడిచట వనవాసమునకై వచ్చిన శ్రీరామచంద్రమూర్తిని దర్శించి సేవించి స్వామిని సీతాలక్ష్మణ సమేతంగా ఎల్లప్పుడు తన శిరము (శిఖరము) నందే నివసించునట్లు కోరుకొనెను. కలియుగములో అతనికోరిక దీర్చెదని స్వామి వరమొసగెను. శ్రీరామ కటాక్షమునకై భద్రుడు గిరిరూపంలో కఠోర తపమాచరించ సాగెను. రామావతారం చాలించి స్వామి వైకుంఠమునకేగెను. భద్రుని తపస్సు ఇంకా సాగుతూనేయుండెను కలియుగారంభమాయెను. అంత సత్యవాక్పరిపాలకుడును భక్తపరాధీనుడును నైన శ్రీ మహావిష్ణువు ఆత్రమాత్రమున శంఖచక్రములు కుడిఎడమలుగా ధరించి బయలు

దేరెను. భద్రునికిచ్చిన వరము ప్రకారము ఆదిశేషుడు లక్ష్మ ణుడై లక్ష్మీదేవి సీతాదేవియై విష్ణువు కోదండరాముడై భద్రగిరి శిఖరముమీద స్థిరనివాసమేర్పరచుకొనిరి. మహావిష్ణువు భద్రాచల రాముడగుటచేత దేవతలు, ఋషులు భద్రగిరికి వచ్చి స్వామిని సేవించుకొనుచుండిరి. ఇచటి రామునికి వైకుంఠరాముడని రామ నారాయణుడని ప్రతీతికలిగెను.

దమ్మక్క :- యుగాలు గడిచినాక కలియుగంలో మర్త్యులకు రామదర్శనంతో తరించు నవకాశము మొట్టమొదటిసారి పోకల దమ్మక్కవలన కలిగెను. ఈమె నిరక్షరాస్య నిరుపేదరాలు, శబరికుల సంజాత. భద్రగిరి సమీపాన రెడ్డిపాలెం అను కుగ్రామంలో నివసించే దమ్మక్కకు ఒకనాటిరాత్రి స్వప్నంలో ఈ భద్రగిరిపైన ఒక నిర్జన ప్రదేశంలో ఒక తాటిచెట్టుదగ్గర సీతారామలక్ష్మణ విగ్ర హాలు కనుపించెను. మరురోజున దమ్మక్క తన కూతురును వెంట నిడుకొని గుట్టపైకెక్కి వెదకిచూడగా తాను కలలో చూచిన దివ్య మూర్తులగుపడెను. ఆ పేదభక్తురాలు అచటనే ఒకచిన్న మంటప మును కట్టించి దివ్యమూరుల నందుంచి భక్తితోపూజించి కృతార్థు రాలయ్యెను. కలియుగంలో భద్రాద్రిరాముని మొదటిసారి పూజిం చిన ప్రథమ మానవభక్త శిఖామణి ఈ దమ్మక్క. మరుగున పడి పోయిన యుగాలనాటిది భద్రాచలం. కలియుగంలో భద్రాద్రి రాముని దర్శించి పూజించుకొనుభాగ్యం మానవాళికి దమ్మక్క మూలాననే కలిగినదని చెప్పాలి ఈమెయే త్రేతాయుగంలో శబరి యేమో! మహాత్ములు మానవ కళ్యాణార్థం మళ్లి మళ్లి పుట్టరా? భద్రాచలక్షేత్రానికి మూలకారకురాలైన దమ్మక్కభక్తురాలి స్మృతి చిహ్నంగా ఒక శిల్పంకాని గుడికాని ఉంటే బాగుండుననిపించును. కాని అట్టిదిచట కనిపించదెందుకో?




దమ్మక్క స్వప్నదర్శనం

2. గోదావరి-వర్ణశాల

కలిలో లోకమునుద్ధరించ తొలుతన్

కాన్పించి తా కోయ పో

కల దమ్మక్కకు స్వప్నమందున భవ

త్కారుణ్య దివ్యామృతో

జ్జ్వలధా రాయుతి నిమ్నజాతులకునై

జాతైత్రైపో మా సహ

త్సలతావాటిక నాటః భద్రగిరి సీ

తారామచంద్రప్రభూ!



అరెరే! ఎంగిలివడ్డ పండ్లకయి అం
జాచేతయా! పండ్లకై
కరువుంగొంటివ! ఆకలిన్ సయిప లే
కన్ దింటివా! లేక భ
క్తిరసంబెంగిలి కాదొ! ఆ శబరి కీ
తిన్ గాన్కంజెల్లింప దు
స్తర మార్గంబది మాకు భద్రగిరి సీ
తా రామచంద్రప్రభూ!

దమ్మక్క రామదాసులు సమకాలీనులు. దమ్మక్క ఉదంతం మూడువందల సంవత్సరాలనాటిదే. అయితే మరియిచటి మూలవిగ్రహాలను స్తుతించు "వామాంకస్థిత" అను ప్రసిద్ధశ్లోకం ఆదిశంకరులు చెప్పినదందురు. శంకరులకాలం 8వ శతాబ్దం. పైన చెప్పినట్లు మానవలోకానికి మరుగైనా భద్రగిరిక్షేత్రం దేవఋషులచే అనాదినుండి దర్శింపబడుచుండెడిది. శంకర భగవత్పాదులును దర్శించిరి. శ్రీవారికి సాధ్యముకానిదేమున్నది.

మత సామరస్యత :- పూర్వం భద్రాచలక్షేత్రం గోలకొండ తానీషాలచే పిదప ఆసిఫ్ జాహీ మరియు నిజామ్ నవాబులచే వంశ పారంపర్యంగా నిర్వహింపబడుట మొన్నటివరకు ఈ దేవాలయ నిర్వహణార్థం స్వామివారి అర్చన సంసేవాదుల నిమిత్తం నిజాము ధనాగారమునుండి ఇరవైవేల రొక్కం వస్తూఉండటం చూస్తే మత సామరస్యతకిది ఎంతఅపూర్వ నిదర్శనమో వేరే చెప్పనక్కరలేదు. మరొక ఆసక్తికరమైన విశేషమిట్లు చెప్పుదురు. మహనీయుడైన కబీరుదాసు ఈ క్షేత్రానికి ఒకపకీరురూపమున స్వామి దర్శనార్థం రాగా అర్చకులతనిని ఆక్షేపించి ఆలయప్రవేశమీయకుండిరి. అంత స్వామివారి విగ్రహాలు కనబడకుండ మాయమైపోయెను. స్వామికి కులమత తత్వాల పాటింపు లేదని నిజమైన భక్తియే ప్రధానమని అర్చకులు గ్రహించినవారై కబీరుదాసుకు ఆలయ ప్రవేశమిప్పించిరి. వెంటనే విగ్రహాలు స్వస్థానంలో కనుపించెను. రామదాసు కబీరుదాసుచే రామ మంత్రోపదేశము పొందెనందురు కాని రామదాసు కాలము 17వ శతాబ్దమయితే కబీరుదాసుకాలము 14వ శతాబ్దము. ఇది పొసగదు. కాని తపోధనులకు సాధ్యము కానిదేమున్నది. వారు చిరంజీవులు. అవసరమైతే ఎప్పుడైనా కన్పింతురు ఇది ఆర్యోక్తి.

రామదాసు :- ఈయనే కంచర్ల గోపన్న. రామభక్తుడై భద్రా
చల రామదాసుగా పేరొందెను. ఖమ్మం పట్టణానికి సుమారు
20 కి. మీ దూరంలో గల చరిత్రాత్మకమైన నేలకొండపల్లి వాస్త
వ్యుడు అక్కన్న మాదన్నలకు మేనల్లుడు. సంస్కృతాంధ్ర
ములేకాక ఉర్దూ పారశీకభాషలు చక్కగా నేర్చినవాడు. సత్కవి
సద్భక్తుడు. రాజకీయ ప్రతిభకలవాడు గోలకొండ నవాబు
అబ్దుల్ హసన్ తానీషా హయాములో పేష్కారుగా నియమింప
బడి తరువాత తన సమర్థతను నిరూపించుకున్నవాడై హసనాబాదు
అనబడు పాల్వంచ పరగణాధికారిగా నియమింపబడెను.
"పాల్వంచ" ఇప్పటి కొత్తగూడెం బూర్గంపాడు భద్రాచలం తాలూ
కాలు కలిపి హసనాబాదు పరగణాగా వ్యవహరింపబడుచుండెను.
దీనికి పాల్వంచ హెడ్క్వార్టర్స్. సమర్థత సత్ప్రవర్తనాది సాంప్ర
దాయముకల వారికే బాధ్యతాయుత ఉద్యోగములిచ్చే కాలమది.
హసనాబాదు పరగణాలో సర్కారీశిస్తులు బకాయ పడియుండెను.
కార్యదక్షతకల గోపన్న సరస సాత్విక మార్గమున బకాయలను
నేర్పుతో వసూలు చేస్తువచ్చెను. అప్పుడే భద్రాచలంలో పోకల
దమ్మక్క అపూర్వ వృత్తాంతము విని భక్తిపరుడైన గోపన్న తన
మకాము పాల్వంచనుండి భద్రాచలానికి మార్చెను. ఆకాలములో
దమ్మక్క వృత్తాంతము గోపన్ననేకాదు ఆప్రాంతపు సమస్తప్రజల
నాకర్షించి యుండును. ఆ పరగణాధికారియైన గోపన్న
ప్రజానుకూలత నూతగా గ్రహించి భద్రాచల ఆలయ ప్రాకారాదులు
నిర్మించటం ఆగమశాస్త్ర విధానము ననుసరించి దివ్యమూర్తులకు
అర్చనసంసేవాదులుజరిపించటం అమూల్యాభరణాదులు చేయించటం
మొదలగునట్టి ఆలయ సముద్ధరణాది కార్యక్రమాలు చేపట్టెను
మతసామరస్యతగల తానీషానుండి అనుమతి Ratification)



సింగరేణి కాలరీస్ కోల్ మైన్స్

ఇటఁలంకేశుఁడు సీతనెత్తుకొని పో

యెన్ గర్భశోకాగ్నిఁ గ్రిం

గుటఁ భూదేవికి గుండియల్ గమిలి బొ

గున్ దేరఁ 'కోల్ మైను' లి

చ్చుట వర్తిల్లె - పరోపకార మొనగూ

ర్చున్ సజ్జనుల్ మానరం

తటి సంతప్తులునైన భద్రగిరి సీ

తా రామచంద్రప్రభూ!

— రసప్రియ

తప్పక లభించుననను నమ్మకంతో ముందుగా అనుమతికై వ్రాస్తూ ఆరులక్షల ప్రభుత్వధనం ఆలయ సముద్ధరాణాదులకై ఖర్చుపెట్టెను కాని విధి వక్రించుటచే తానీషా అట్టి ఖర్చును అక్రమ వ్యయం (Misappropriation) క్రింద జమకట్టి గోపన్నను నేరస్తునిగా బంధించి కారాగార శిక్ష విధించెను. గోపన్న 12 ఏండ్లు గోలకొండ కోటలోగల చెరసాలలో నుంచబడెను. అక్కన్న మాదన్నలు అత్యంత ప్రధానమైనపదవులలో నున్నారు. తన మేనల్లుడైనగోపన్నను చెరసాలనుండి విడిపించక పోవటం తానీషా పరిపాలనలో బంధు ప్రీతి పక్షపాతములకు తావు లేకుండెననుటకు నిదర్శనము. కాకున్నచో మతాంతరులైన అక్కన్న మాదన్నలకు మంత్రిపదవు లిత్తురా!

కారాగార శిక్ష కఠినమైనది. రామదాసు (గోపన్న) ఎంత భక్తుడో అంత ఉద్దండ పండితకవి. చంపకోత్పలాలలో దాశరధి శతకం ప్రౌఢంగా వ్రాసినవాడు. పద్య గద్య గేయ రచనా ధురీణుడు అయినా భక్తి రసావేశంలో తన పాండిత్యమంతా మరచి అచ్చతెనుగు నుడికారంలో కీర్తనలు పాడుతూ రాముని తెనుగు దేవునిగాచేసికొన్న గేయకవి సార్వభౌముడు. భక్తికి పాండిత్యమక్కరలేదుకదా! జాను తెనుగు పాటల గేయ కవిత్వంతో నే రామస్వామిని ఆకట్టుకొనికదలించి వేసెను

"ఇక్ష్వాకుకుల తిలక! ఇక నైన పలుకవే! రామచంద్రా! నన్ను
రక్షింపకున్నను రక్షకు లెవరింక! రామచంద్రా!
చుట్టు ప్రాకారాలు సొంపుగ గట్టిస్తి! రామచంద్రా!
ఆ ప్రాకారమునకయ్యె - పదివేల వరహాలు రామచంద్రా!
లక్ష్మణునకు చేయిస్తి రవ్వల పతకము రామచంద్రా
ఆ పతకమునకు పట్టె - పదివేల వరహాలు రామచంద్రా!
సీతమ్మకు చేయిస్తి - చింతాకు పతకము రామచంద్రా!
ఆపతకమునకు పట్టె - పదివేల వరహాలు రామచంద్రా!

కలికి తురాయి నీకు - ఘనముగ జేయిస్తి రామచంద్రా!
నీవు కులుకుచు దిరిగెద వెవరబ్బసొమ్మని రామచంద్రా!
అబ్బ! చిట్టితినని - ఆయాసపడవద్దు రామచంద్రా! ఈ
దెబ్బలకోర్వక - తిట్టితినిన్నిట్లు రామచంద్రా!''

ఇట్లా బందీ ఖానాలో బాధల కోర్వలేక రామచంద్రమూర్తిని నిష్టుర నిశితాంకుశకవితాధారతో దెప్పి పొడిచెను భక్త్యావేశంలో భక్తునికి భగవంతునితో ఎంత చనువు! చనువు సహజమైన సాధారణ భాషలోనే సాగునుకదా! కారాగారశిక్ష పన్నెండేండ్లు అనుభవించినా భక్తి పతనం కాలేదు. చివరకు "నీవుందవ్వనితః పరంబెరుగ రావే! - - - - - సంరక్షింపు భద్రాత్మకా!

అన్నట్లు శరణాగతుడై "అడుగుదాటి కదల నీయను-నా కభయమీక విన్ను విడువను" అని సామీప్య భక్తి పారవశ్యంలో రాముని బతిమాలెను. అంత కరుణామయుడు శరణాగత రక్షక బిరుదాంకితుడునైన రామచంద్రమూర్తి లక్ష్మణసమేతుడై వచ్చి అర్ధరాత్రి సమయములో తానీషాకు దర్శనమిచ్చి ఆరులక్షల మాదలు చెల్లించి రశీదు తీసుకొని రామదాసును చెరసాలనుండి విడుదలచేసెను. రామ లక్ష్మణులు చెల్లించిన బంగారు నాణెములలో ఒకటి రెంటు నేటికిని భద్రాచల ఆలయంలో చూడవచ్చును. రామదాసుగారు చేయించిన అమూల్యాభరణాదులునూ చూడ వచ్చును. సాక్షాత్కారంగా రామ లక్ష్మణ దివ్యదర్శనం పొందిన వాడై ఈ అపూర్వ సంఘటనకు అచ్చెరువంది తానీషా హసనాబాదు పరగణాను భద్రాద్రి రామచంద్ర ప్రభువు కైంకర్యార్థం జాగీరుగా ఫర్మానా జారీ చేసెను రామదాసు రాముని సేవించి తరించెను. బంది ఖానా బాధలననుభవించిన సంఘటన బాధాకరముగా తోచినా చివరకు భక్తితో సాధించి మతాంతరులైన నవాబులచే భద్రాచల

దేవాలయమును సమాదరింపజేసిన రామదాసుగారి దివ్యచరిత్ర మత సామరస్యత నెలకొల్పునట్టి చిహ్నమై, చిరస్మరణీయమైనది.

1687 ఆరంభంలో గోలకొండకోటను ఔరంగజేబు జయించి తానీషాను అరెస్టుచేసి దౌలతాబాదు జేలుకు పంపెను కాబట్టి దీనికి ముందే రామదాసు తానీషాల వృత్తాంతం జరిగినది అది 1674–86 కాలం 12 ఏండ్లు రామదాసుబందిఖానాలో గడిపినకాలం

రామదాసుగారి అనంతరం భద్రాచల దేవస్థానం రాజకీయ కల్లోలాలవల్ల చాలకాలం దుస్థితిలో గడుపవలసి వచ్చెను. 1769 సం॥ లో విధ్వంసకుడైన "ధంసా" అను యువసేనాని భద్రాచలంపై దండెత్తిరాగా విగ్రహాభరణాదులను పోలవరం చేర్చిరి. అప్పుడే భల్లాపేరయకవి వ్యాజస్తుతిగా భద్రగిరి శతకము వ్రాసెను ఈ గ్రంథమువల్ల అనాటి రాజకీయ పరిస్థితులు దెల్లమగును. 1775 సం॥లో విగ్రహాలు పోలవరం నుండి తిరిగి భద్రాచలం తేబడెను మరే కారణముచేతనో విగ్రహాలు 1776 సం॥లో బస్తరు ప్రాంతాలలోగల "కమలాపురం" చేర్చబడి పిమ్మట 1785 సం॥లో తిరిగి భద్రగిరికి తీసుక రాబడెను. భద్రాచలం ఇట్టి అస్తవ్యస్త స్థితిలో నుండగా లక్ష్మినరసింహదాసు వరదరామదాసు అను ఇద్దరు భక్తులు నిజాము మంత్రియగు చందూలాల్‌గారిని దర్శించి తానీషా ప్రభువు రామదాసున కొసంగినట్టి ఫరమానాను పునరుద్ధరింపజేసిరి. దేవాలయపునరుద్ధరణకై వీరిరువురు కావించిన కృషి చిరస్మరణీయమైనది. వీరి యనంతరము దేవస్థాన బాధ్యత వహించుటకు తగిన వారెవ్వరు లేనందున చందూలాల్‌గారు దేవాలయ వ్యయమునకు రు. 18500 నిర్ణంచి శ్రీరాముని పేరనే సనదు జారీ చేయించెను. (1855 సం॥) తరువాత అది ఇరువైవేల

రూపాయల వరకు నిర్ణయింపబడెనందురు. ఇట్లు గోలకొండ తానీషా తరువాత హైద్రాబాదు నిజాము నవాబులనూ భద్రాది రామచంద్రుని కైంకర్యార్థమై ప్రతి సం॥ ఇరువేల అర్పు భరిస్తూ ఏటా శ్రీరామనవమికి సీతారామ కళ్యాణోత్సవ సందర్భంలో తలంబ్రాలకని మంచి ముత్యాలు పంపుట ఆచారముగా ఉండెనందురు

భద్రాచలంలో శ్రీరామనవమినాడు సీతారామకల్యాణ మహోత్సవము వైభవోపేతముగా జరుగును. దేశం నలుమూలల నుండి వ్యయప్రయాసలకోర్చి భక్తజనులు తండోప తండములుగా వచ్చి కల్యాణోత్సవమును కనులపండువుగాచూచి స్వామిని సేవించి తరించుచున్నారు

శ్రీ రామనవమి ఉత్సవాలనాడు భద్రాచలం దర్శించే వారికి ప్రాప్తించు పుణ్యఫలం గురించి బ్రహ్మాండ పురాణంలో ఇలు చెప్పబడినది.

"సంప్రాప్య రామ నవమీం తులసీదళాద్యైః
సంపూజ్య భద్రగిరి వాసిన మాది దేవం
కృత్వోపవాస మథ జాగరణం చ మర్త్యః
సాక్షాత్పదం రఘుపతేః పరమం ప్రయాతి"

మంగళం మహత్ శ్రీ శ్రీ శ్రీ

---

ఆధారం —: 1. జనశ్రుతి 2. శ్రీమాన్ కొదమసింహం సత్యనారాయణా చార్యులవారి "స్తంభాద్రి" అను గ్రంథం 3. సెన్సెస్ ఆఫ్ ఇండియా 1961 ఆంధ్రప్రదేశ్ ఫేర్స్ అండ్ ఫెస్టివల్స్.



గ్రంథకర్త:

## పోతేదార్ కేశవాచార్యులు

కలం పేరు : రసప్రియ

జననీ జనకులు : రామమ్మ, జానకీరామాచార్యులు

స్వగ్రామం : శ్రీరంగాపురం వనపర్తి తా॥ మ॥ నగర్ జి॥

ఉద్యోగం : ఖమ్మంజిల్లా ప్రణాళికా గణాంక శాఖాధికారి

అభ్యస్త విద్యలు : ఆర్థికశాస్త్రంలో పట్టభద్రులు, ఆంధ్రాంగ్ల, ఉర్దూ హిందీ భాషలలో పరిచయ పాండిత్యములు

అభిరుచులు : కవిత్వం, చిత్రలేఖనం, తత్త్వశాస్త్రం, చరిత్ర పరిశోధన.

వ్యాసంగములు : క్షేత్ర చారిత్రక సాంస్కృతిక రచనలు, సాంఘికార్థిక ప్రణాళికా గణాంక సమీక్షలు

## ఈ కవి కృతులు

**ముద్రితం**

1. శ్రీ రాజరాజేశ్వర శతకము
2. శ్రీరామలింగేశ్వరనక్షత్రమాల
3. అమర స్మృతులు
4. బుద్ధ చరితము (గోలకొండ పత్రికలో)
5. శ్రీ సీతారామతారావళి

**అముద్రితం**

1. మాతృశ్రీ
2. శ్రీరంగనాథ శతకము
3. గేయకథలు
4. గణాంకదర్శిని
5. భద్రమాలికలు
6. The Economic History of Ancient Andhras

# తప్పొప్పులు

| పేజి | తప్పు | ఒప్పు |
|---|---|---|
| దుర్గాష్టకము లో రెండవ పద్యం | హాసలహోరీ | హాసలహారి |
| 11 | నొవ్వన్నధికక్రుపుల్ | నొవ్వ≡నదికక్రుపుల్ |
| 33 | విష్ణుప్రాప్తి | విష్ణు పాదప్రాప్తి |
| 34 | రోమాంకురమగును | రోమాంచమగును |
| 35 | రావణుడు పర్ణశాలను సమీపించలేదు | రావణుడు పర్ణశాలను సమీపించెను. |
| 43 | పదవులలో నున్నరు | పదవులలోనున్నను. |
| 44 | చిట్టితి | తిట్టితి |
| 44 | మూదలు | మొదలు |
| 44 | రెంటు | రెండు |
| 44 | కైంక్యకార్థం | కైంకర్యార్థం |
| 45 | యువసేనాని | యవన సేనాని |
| 46 | ఇటు | ఇట్లు |
| 46 | రఘపతే: | రఘుపతే: |
| 33 | గోదావరీ పార్శ్యయోః | గోదావరీ పార్శ్వయోః |

---

"నేటి మానవజాతిలో జటాయువులాంటి వీరులెందరున్నారు?
నేటి సమాజంలో దురాగతాల నెదురించు ధీరులెందరున్నారు?
సౌజన్యానికై సమరంలో అమరుడైన జటాయుగాథ।
జన సంఘాన్ని ఉద్ధరించే చేతనామృత బోధ।"